శతజయంత్యుత్సవ ప్రత్యేక సందర్భంగా

ఆకాశమంత అక్షరమూర్తి

# డా. ఆవంత్స సోమసుందర్

(వజ్రాయుధ కవికి వందేళ్ళు)




ప్రచురణ

**సాహిత్య సమాఖ్య**

పిఠాపురం

# శతజయంత్యుత్సవ సంబరం సందర్భంగా

ఆకాశమంత అక్షరమూర్తి

# డా. ఆవంత్స సోమసుందర్ ని

## చిన్ని అద్దంలో ఆత్మీయంగా...

## (వజ్రాయుధ కవికి వందేళ్ళు)

## గౌరవ్


**ముద్రణ**

సోసు శతజయంతి సందర్భంగా ప్రత్యేక ప్రచురణ 2024

**ప్రచురణ**

సాహిత్య సమాఖ్య, పిఠాపురం

**మూల్యం**

అమూల్యం



**వివరాలకు**

సెల్ : 9032094492

gouravmeka@gmail.com

# సాహితీ శిఖరానికి సాదర నివాళి

తెలుగు సాహితీ లోకంలో శిఖరాయమాన స్థాయికి చేరుకున్న అతికొద్ది మంది కవుల్లో మొదటి వరుస పేరు ఆవంత్స సోమసుందర్.మహా మనీషి రవీంద్రనాథ్ టాగూర్ ని ముఖా ముఖి దర్శించుకొని తరించిన మహాకవి ఆవంత్స. సంస్కృత ఆంధ్రాంగ్ల సాహిత్యాల్లో ఆయన చూపు ప్రసరించని మనిషి కానీ,ప్రక్రియ కానీ లేవు.

అంతటి మహావ్యక్తితో దాదాపు దశాబ్దానికి పైగా అతి చనువుగా మెలిగే అవకాశం కలగడం ఒక అదృష్టం. ఆయన జీవితాన్ని దగ్గరగా చూసి, మాటలు విని, ఆచరణ పరిశీలించేందుకు రెండు పదులు దాటని యువకుడికి లభించిన ఆనాటి స్నేహం ఆశ్చర్యం కాక మరేమిటి. నిజానికి సామాజిక కార్యకర్తగా ఈరోజు నా స్కూల్ వేరు, దాని పరిధి వేరు.

అయినప్పటికీ, ఒకానొక కాలంలో పూర్తి సాహిత్య రసజీవిగా మసలడానికీ, అలా నన్ను మలచడానికి నిజాయితీగా ప్రయత్నించిన వ్యక్తి సో. సు.గారు. ఈరోజు మా ఆరంభ దినాల్ని తల్చుకుంటే మా మధ్య నెలకొన్న వాత్సల్యానికి ముగ్ధుడ్ని వుతుంటాను. అదుగో, అలా ఆ అమూల్యమైన అనుభవాల్ని తల్చుకుని వాటికి అప్పుడప్పుడు ఇచ్చిన అక్షరరూపాలే ఈ వ్యాసాలు.

చెన్నైలో తొంభై ఏళ్ళు జీవించిన మా చినతాత 'కళానికేతన్' పేరిట చిత్రకళా సంస్థ ఏర్పాటు చేశారు.చిన్నతనంలో ఆయన వద్ద కూర్చుని ఎంత కుతూహలంతో ఆయన బొమ్మలు వేస్తుంటే చూసే వాణ్ణో, 'కళాకేళి నికేతన్' సంస్థ ఏర్పాటు చేసిన సో.సు. వద్ద కూడా కాస్త పెద్దయ్యాక అంతే శ్రద్ధగా కూర్చుని సాహిత్యం గురించి చెప్తుంటే వినేవాడ్ని. అలా సారస్వత స్పృహ నాలో కలగడానికి సో.సు. స్నేహం ఓ ప్రధాన కారణం.

ఆవంత్స సోమసుందర్ శతజయంతి నిజానికి తెలుగు సాహితీలోకం పూనుకొని చేయాల్సిన బృహత్తర కార్యక్రమం. కానీ, అవకాశవాద ధోరణులు, అవగాహన శూన్య వాదనలు రాజ్యమేలుతున్న చోట అర్థవంతమైన కార్యా చరణ కుదేలవుతుంది. అందులో భాగమే అప్రకటితంగా సో.సు. కృషి పట్ల అమలౌతున్న మేధో అంటరానితనం. దాని నిర్మూలన బుద్ధి జీవులందరి బాధ్యత.

ఈ కృతికి సహకరించిన డా. ఆవంత్స సోమసుందర్ లిటరరీ ట్రస్ట్, పిఠాపురం వారికి, సహృదయ మిత్రమండలికి, నాలుగు రోజులు కంటి ఆపరేషన్ కోసం ముంబై నుండి హైద్రాబాద్ వచ్చి ఆ తొందర్లో ఉండి కూడా సమయాన్ని కేటాయించి విశిష్టమైన సందేశాన్ని డిక్టేట్ చేసి పంపించిన కామ్రేడ్ వరవరరావు గారికి, సహకరించిన మిత్రులు వేణుగోపాల్‌కి ప్రత్యేక కృతజ్ఞతలు.

అందులో భాగంగా సామాజిక మాధ్యమాల్లో అడపాదడపా సో.సు. గారి గురించి రాస్తూ వచ్చిన వ్యాసాలన్నింటినీ ఒక్క దరికి చేర్చడం జరిగింది. మొదటిసారి 'ఆరుద్ర'ని త్వమేవాహం ద్వారా సో.సు.యే పరిచయం చేసారు. ఆరుద్ర శతజయంతి సందర్భంగా ఈ కృతిని ఆయనకి అంకితం ఇస్తున్నాము. ఆవంత్స సోమసుందర్ శతజయంతి సందర్భంగా తీసుకువస్తున్న ఈ చిన్న పొత్తం చదివిన ఒక గుప్పెడు మంది యువజనమైనా సో.సు. జీవితం నుండి స్ఫూర్తిని పొందగలిగితే అంతకు మించిన సార్థకత ఈ అక్షరాలకి మరేదీ లేదనేది నా అభిప్రాయం. పునరుక్తులకు, అక్షర దోషాలకు, అన్వయ లోపాలకు పూర్తి బాధ్యత నాదే. విమర్శలకు ఆహ్వానం.

**– గౌరవ్**

**తన చరిత్ర తనే పఠించి, ఫక్కున నవ్వింది ధరణి ;**
**తన గాథను తనే స్మరించి భోరున ఏడ్చింది ధరణి ;**
**వృద్ధజగతి సమాధిపై సమధర్మం ప్రభవించును ;**
**నిద్దుర చీకటి వెలుపల వేకువ మెళుకువ పుట్టును.**
**ధరణీ చక్రం గిర గిర పరిభ్రమిస్తోం దదిగో**
**నిమ్నోన్నతముల జగతికి ఉద్వాసన చదువుతోంది;**
**– సమధర్మం – వజ్రాయుధం**

# అంకితం



భాగవతుల సదాశివశంకర శాస్త్రి అంటే ఎవరో తెలీక తెల్లమొహం వేసేవారికి కూడా "ఆరుద్ర" అనగానే వెంటనే కొన్ని కవితలు, మరికొన్ని పాటలు, ఇంకొన్ని గొప్ప పరిశోధన విషయాలు చప్పున గుర్తుకు రాక మానవు.

అభ్యుదయ సాహిత్యంలో అగ్రశ్రేణి కవి, రచయిత, అనువాదకుడు, మహా పరిశోధకుడు, పత్రికా సంపాదకుడు, హేతువాది, సామ్యవాది, చరిత్రకారుడు... ఇలా చెప్పుకుంటూ పోతే ఇంకా ఎన్నో ఆరుద్ర గురించి చెప్పుకోవచ్చు.

మేధస్సును, ఆరోగ్యాన్ని అవిశ్రాంతంగా ఖర్చుచేసి 'సమగ్రాంధ్ర సాహిత్యాన్ని' ఏకంగా 14 సంపుటాల్లో రూపొందించిన అసాధారణ కృషీవలుడు ఆరుద్ర. ఆయన గురించి చెబితే అది మరొకంత ఉద్గ్రంథం.

అలాంటి 'ఆరుద్ర'ని తెలుగు సాహిత్యం లో అగ్రశ్రేణి కవిగా నిలిపిన 'త్వమేవాహం' ని మొట్టమొదటిసారిగా ప్రచురిం చినది ఆవంత్స సోమసుందర్. కాన, సో.సు. శతజయంతి ఉత్సవాన్ని పురస్కరించుకుని, శతజయంతి మహోత్సవానికి కూతవేటు దూరంలో ఉన్న కూనలమ్మ, 'ఆరుద్ర' కి, మహాకవి ఆవంత్స సోమసుందర్ గురించి వెలువరిస్తున్న ఈ కృతినిలా నమస్సులతో స్మరించుకుని సమర్పించుకుంటూ...

**– గౌరవ్**

# ఆవంత్స సోమసుందర్ - ఆనాటి జ్ఞాపకాలు

కవిత్వం – మార్క్సిజం (తెలుగువాదం – ఆవంత్స సోమసుందర్)కు ముందుమాటగా నేను రాసిన 'మానవసారం' లో మిత్రమండలి వార్షికోత్సవాల సందర్భంగా ప్రత్యక్ష కలయికతో మా అనుబంధం గాఢమయిందని రాసాను.

సోమసుందర్ 'మిత్రమండలి'కి వచ్చిన సందర్భం శ్రీశ్రీ పై సాహిత్య సదస్సు – 1966 జనవరి అనుకుంటాను. శ్రీశ్రీ పుట్టినరోజు ఏప్రిల్ 30 అనే ప్రామాణిక ఆధారం చలసాని ప్రసాద్ శోధించి కనుగొనే దాకా జనవరి 2 ఆయన జన్మదినంగా శ్రీశ్రీ అభిమానులు జరుపుకునేవారు. అవి మిత్రమండలి పదవ వార్షికోత్సవాలు కూడ కాకపోవచ్చు. కాళోజీ సోదరుల పూనికతో 'మిత్రమండలి' 1957 – 58 విద్యాసంవత్సరంలో ఏర్పడింది.



కవి, పండితులు అనుముల కృష్ణమూర్తి గారు శ్రీశ్రీ సాహిత్యంపై సదస్సు నిర్వహించి తిలక్, సోమసుందర్‌లను పిలిస్తే బాగుంటుందని సూచించారు.

చేతనావర్తం కవుల్లో ఒకరు, మిత్రమండలికి చలివేందిర వంటివాడు వే.నరసింహారెడ్డి ఇంట్లోనే తిలక్ రెండురోజులున్నాడు. అది వేనరె ఇంటిముందే ఒకే కాంపౌండులో ఉన్న విడిది లాంటి ఇల్లు. కనుక సాహిత్యాభిమానులందరికీ ఆ రెండు రోజులూ తిలక్‌ను కలవడం వీలయింది. అక్కడే వేనరె, అంపశయ్య నవీన్, నేను ఆయనతో ఒక ఆధునిక సాహిత్య పత్రిక ప్రారంభిద్దామని విస్తృతంగా చర్చించి ఒక అంగీకారానికి వచ్చాం. మే నెలలో సృజన అని పేరు కూడ నిర్ణయించాం. తిలక్ హఠాన్మరణంతో అది తిలక్ సంస్మరణసంచికగా 66 నవంబర్‌లో వెలువడింది. తదనంతరమంతా చరిత్రలో భాగమే.

సోమసుందర్ గారు మరో చేతనావర్త కవి పేర్వారం జగన్నాథం గారి కోరికపై ఆయన ఇంట్లో దిగారు. పేర్వారం, వేనరె ఇద్దరూ కూడా వరంగల్ ఆర్ట్స్

అండ్ సైన్స్ కాలెజ్‌లో అప్పుడు తెలుగు లెక్చరర్లు. పేర్వారం జగన్నాథం ది ఖిలాషాపురం. అప్పటి వరంగల్‌జిల్లా. అంటే నైజాం ఫ్యూడల్ రాచరిక పాలనకు వ్యతిరేకంగా తురక, దూదేకుల మొదలు సబ్బండ శూద్ర కులాలను, మహిళలతో సహా సమీకరించి తెలంగాణలో కొంత భూభాగాన్ని పరిపాలించి ఆ ఊళ్లో కోట నిర్మాణం చేసిన సర్వాయ పాపన్న చరిత్రను తొలుత పరిశోధించిన వాడే కాకుండా సోమసుందర్ పై ఆయన గాఢాభిమానానికి కారణం ఆయన కడివెండి గ్రామం గురించి దొడ్డి కొమురయ్య గురించి వజ్రాయుధంలో ఉత్తేజకరంగా రాయడం. ఆ ఊరు అపుడు కడివెండి సీతారాంపురం పంచాయితీలో భాగం. సీతారాంపురం జగన్నాథం గారి అమ్మమ్మ ఊరు. ఆయన మేనమామ ఆరోజుల్లో కమ్యూనిస్టుపార్టీ సానుభూతిపరుడు. పేర్వారం జగన్నాథం కూడ అరసం పట్ల అనుకూలంగా ఉండేవారు. ముఖ్యంగా కడివెండి నల్లా నరసింహులు రెండు ఉరిశిక్షలు తప్పించుకున్న కమ్యూనిస్టు విప్లవకారుడు. దొడ్డికొమురయ్య అమరత్వం గురించి చెప్పేదేముంది. సోమసుందర్ 'మిత్రమండలి'కి రావడానికన్నా ముందే వాళ్లకు ఉత్తర ప్రత్యుత్తరాలు బహుశా ప్రత్యక్ష పరిచయం కూడ ఉండిఉంటుంది.

అట్లా తిలక్‌తో మా చర్చల్లో సోమసుందర్ భాగం కాలేకపోయాడు. అయితే ఎట్లా ఉండేదో ఇప్పుడు చెప్పలేను గానీ, శ్రీశ్రీ షష్ఠిపూర్తి, విరసం ఏర్పాటు తర్వాత ఆయన 'కళాకేళి' ప్రారంభించాడు.

కాని అంతకన్నా ముందే నా నవయువ్వనం లోనే 'వజ్రాయుధం' సోమసుందర్‌గా నాకు ఆయనొక 'ఐకన్'. నైజాం-పాదుషాహిని ధిక్కరించి దొడ్డి కొమురయ్యను హీరోను చేసిన కవి, తెలంగాణ నవయవ్వనానికి ఒక ప్రేరణ కాకుండా ఎట్లా ఉంటాడు? ఐతే నేను ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్‌లో ఉన్నరోజుల్లో కుందుర్తి నిర్వహించిన ఫ్రీవర్స్ ఫ్రంట్ సమావేశాల్లో నెహ్రూ మరణం (27 మే, 1964) తర్వాత నేను నెహ్రూ పై రాసిన కవిత చదివినపుడు హైదరాబాదుకు పనిమీద వచ్చి ఆ సమావేశంలో పాల్గొన్న సోమసుందర్ కన్నీళ్లు పెట్టుకొని నన్ను కౌగిలించుకున్నాడు.

ఆ తరువాత ఆ కవితను విస్తృతంగా ప్రచారం చేసింది కూడా ఆయనే. అంతకుముందే శ్రీశ్రీ, కెవిఆర్, తిలక్ లతో పాటు నాకు ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండేవి. ఈ ప్రత్యక్ష అనుబంధంతో నేను 1964 డిసెంబర్ 24–25 మధ్య రాత్రి జరిగిన నా పెళ్లి శుభలేఖ ఆయనకు పంపించాను. నా సహచరి హేమలత ఊరు రాజవరం. ఆయన వెంటనే ఆ రోజుకు నాకు అందేలా ఒక చక్కటి డిజైన్‌తో 'హేమవరం' అనే శీర్షికతో నాకు శుభాభినందనలు పంపించాడు. దాదాపు 59 సంవత్సరాల క్రితం పంపిన ఈ అభినందన లేఖను నేనెంతో అపురూపంగా దాచుకున్నాను. తరువాతదే రెండురోజుల పాటు మిత్రమండలిలో గడిపిన జ్ఞాపకం. కాని సరిగ్గా, మూడేళ్లకే 67 మే 27న పంచాది కృష్ణమూర్తి, అతని సహచరుల 'ఎన్‌కౌంటర్' మరణంతో నా నెహ్రూ భ్రమలొదిలిపోయి నేను నక్సల్బరీ శ్రీకాకుళ పంథా వైపు ఆకర్షింపబడ్డాను.

ఇంక విశాఖపట్నంలో 70 ఫిబ్రవరిలో సోమసుందర్ ఒకపక్షం, నేనొక పక్షం కావడం తెలుగుసాహిత్యంలో వర్గపోరాటం రచించిన చరిత్రలో భాగం. బానిసల తిరుగుబాటు రచించిన విప్లవకవి సోమసుందర్ – శ్రీకాకుళంలో తాము పోడు చేసుకున్న భూములను బుగతల వల్ల పోగొట్టుకొని తమ భూముల్లో తామే కంబారులైన ఆదివాసుల పోరాటాన్ని సమర్థించలేకపోవడం ఆయన వ్యక్తిగత లోపం కాదు, ఆనాటి అరసం, ఆనాటి సిపిఐ అవగాహనాలోపం. హైదరాబాద్ అభ్యుదయ సదస్సుకు సోమసుందర్ రాలేదు గానీ, ఇంక అక్కడి ఘర్షణాయుత వాతావరణంతో మా దారులు వేరయ్యాయి.

తిరిగి చాలాకాలానికి బహుశా మూడు దశాబ్దాలు గడిచాక హైదరాబాదులో ఉన్న తన కొడుకు దగ్గరికి సోమసుందర్ గారు వచ్చారు. కాలు విరిగి శస్త్రచికిత్స జరిగి, వాకర్ పట్టుకొని నడుస్తున్నారు. నన్ను చూడాలని, ఆ చిరునామా ఇచ్చి తప్పకుండా రమ్మన్నాడు. సరిగ్గా ఆయన చెప్పిన సమయానికి వెళ్లాను. ఎంతో ఆత్మీయంగా గడిపాం. అదే ఆఖరుసారి ఆయనను చూడడం. ఈ మధ్యకాలమంతా చలసానిప్రసాద్ ద్వారా తరచుగా కెవిఆర్ నుంచి కూడా అప్పుడప్పుడు సోమసుందర్

గారి గురించి వింటూనే వున్నాను. ఆ ఇద్దరికీ, మనిషిగా సోమసుందర్ అంటే ఎంతో ఇష్టం. కెవిఆర్ గారికి అనిశెట్టి సుబ్బారావు అన్నా, సోమసుందర్ అన్నా ఎంత ఆత్మీయభావం ఉండేదో. ఇంక చలసాని అయితే ఆయన పిలిస్తే , పిఠాపురం వెళ్లి ఆయనతో గడిపి నన్ను కలిసినపుడు ఆ ముచ్చట్లన్నీ చెప్పి మా అనుబంధాన్ని గాఢతరం చేసాడు. బహుశా తన 80వ యేటనుంచి సోమసుందర్ తనకు నచ్చిన కవులను, తన జన్మదినం రోజున సన్మానించే ఒక సంప్రదాయాన్ని పెట్టుకున్నాడు. చలసాని ద్వారా నేనటువంటివి స్వీకరించనని తెలుసుకొని నా మనసు నొప్పించకుండా నాతో అనుబంధాన్ని పెంచుకునే తన గాఢమైన ఆకాంక్షను కవిత్వం–మార్క్సిజం పుస్తకానికి ముందుమాట రాయమనే ఆదేశంతో 2006లో తీర్చుకున్నాడు. ఆ కథంతా అందులో రాసాను. అయితే ఆశ్చర్యమేమిటంటే ఈ 'తెలుగువాదం' మొదటిముద్రణ నాటికే జార్జిథాంప్సన్ 'హ్యూమన్ ఎసెన్స్' వెలువడిందని, అది త్రిపురనేని మధుసూదనరావు ద్వారా విరసం కు ఒక పాఠ్యపుస్తకమే అయిందని ఆయనకు తెలియదు. నా 'మానవసారం' శీర్షిక ఆ పుస్తక అనువాదమే, ఆ అవగాహన నుంచి వచ్చిందే. "అయ్యో, మార్క్సిజం కవిత్వం విస్తరించి సమగ్రరూపంలో హ్యూమన్ ఎసెన్స్‌గా వచ్చిందని తెలిస్తే దానినే అనువాదం చేసేవాణ్ని కదా" అని తన 83వ యేట ఒక యువకునిగా కలగన్న సోమసుందర్‌కు ఇప్పటికి నూరేళ్లు నిండాయేమో గాని, రాజకీయ చైతన్యం గల తెలుగు పాఠకలోకం ఆయనను 'వజ్రాయుధం సోమసుందర్' గానే గుర్తుపెట్టుకుంటుంది. వట్టికోట ఆళ్వారుస్వామితో మొదలై, తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంతో, ఆ విప్లవ సంప్రదాయంతో మమేకమైపోయిన నాకు సోమసుందర్ ఎప్పుడూ తన యవ్వనకాలపు కవిగానే గుర్తుంటాడు. ఎందుకంటే మమ్ములను కలిపింది కవిత్వం – మార్క్సిజం లోని మానవసారం.

**– వి వి**

(కంటి ఆపరేషన్ కోసం ముంబై నుంచి హైదరాబాద్ వచ్చిన పెద్దలు కామ్రేడ్ వరవరరావు గారు సో.సు.శతజయంతి సందర్భముగా ఈ సందేశాన్ని డిక్టేట్ చేసారు)

# అజరామర వజ్రాయుధ బలం !
# ఆవంత్స సోమసుందర్ కలం !!

రజాకార్ల పేరు వింటేనే బేజారెత్తిపోయే చీకటి రోజుల్లో నిజాం కర్కశత్వాన్ని 'ఖబడ్దార్' అని బహిరంగంగా హెచ్చరించి, నిషేధానికి గురై చరిత్ర సృష్టించిన ప్రజా కలం అది.

కమ్యూనిస్టులంటేనే గంగవెర్రులెత్తి వార్ని దుర్మార్గంగా కాల్చి చంపుతున్న కాలంలో సుఖజీవితపు సౌఖర్యాల్ని కాదని సమాజంలో అసమానతలన్నీ రూపుమాపడం కోసం సొంత కుటుంబంలో నుంచే తిరుగుబాటు బావుటా ఎగురవేసి అజ్ఞాత జీవితాన్ని ఐచ్ఛికంగా కౌగిలించుకున్న విప్లవ కలం అది.

గ్రాంథిక భాష వాడుకతోను, ఛాందస భావాల పాడు కంపుతోను, సంకుచితంగా కాలం వెళ్ళబుచ్చుతున్న తెలుగు సాహితీ జగత్తుని, తన వాడుక భాషతో లాగి లెంపకాయ కొట్టి 'సాహిత్య ప్రయోజనం సామాజికమే నంటూ ఖచ్చితంగా గర్జించి చాటిన కవితా కలమది'.

ఎనిమిది దశాబ్దాల నిరవధిక అక్షర కృషితో తొంభై పైచిలుకు వయస్సు వరకూ నిత్య యవ్వనుడిగా జీవించి వందకి పైబడ్డ గ్రంథాల్ని నిరంతరాయంగా ప్రచురించి వివిధ సంఘాల్ని, పత్రికల్ని స్థాపించి, అనేక యుద్ధాల్లో ఆరితేరి లెక్కలేనంత మంది ఆత్మీయుల్ని సంపాదించుకున్న మానవీయ కలం అది.

పదిమందిని ఉత్తమ సాహిత్యాభిరుచి గల సంస్కారవంతుల్నిగా మంచి మానవ సంబంధాలతో మలచడానికి మించిన విప్లవం వేరేదీ లేదనే ప్రేమపూర్వక కలం అది.

**ఆవంత్స సోమసుందర్ ఆ కలం పేరు.**

**కమ్యూనిజం దాన్ని నడిపిన కాలాతీత హుషారు.**

ఒక్కసారి ఆయనతో పరిచయమైన వాళ్ళెవరైనా ఆయన మృదుత్వానికి గులాము కాక మానరు. చిక్కటి నవ్వుతో, వెచ్చని స్పర్శతో, హృదయపూర్వకంగా అర్థవంతమైన సంభాషణని ఎల్లప్పుడూ ఆహ్వానిస్తున్నట్లు, నిండు మనసుతో పలకరించడం ఆయన నైజం.

సుమారు దశాబ్ద కాలపు సాన్నిహిత్యంలో ఆయనతో ఎన్నో అపురూపమైన విషయాలు చర్చించే అవకాశం వచ్చింది. సో.సు. స్వీయచరిత్ర 'కలలు–కన్నీళ్ళు' ప్రూఫులు చూసి సమన్వయం చేయడం మొదలుకుని 'షెల్లీ జీవితాన్ని' అనువదించడంలో పాలుపంచుకోవడం వరకూ, వజ్రాయుధం ముఖచిత్రాన్ని (సిగార్ పట్టుకుని సోసు నిల్చున్నది) ఎంపిక చేయడం నుంచీ ఎంతో కాలం నుంచి తన వద్ద భద్రంగా దాచుకున్న 'శ్రీశ్రీ' సంతకాన్ని నాకివ్వడం దాకా షెల్లీ కావ్యం 'ప్రొమిథియస్ అన్‌బౌండ్'ని ప్రమథనాథుని బంధవిముక్తి' శీర్షికతో తెలుగు చేయ ప్రయత్నించడంతో ఆరంభించి, 'క్రిస్టోఫర్ కాద్వెల్' 'ఇల్యూజన్ అండ్ రియాలిటీ' అనువాదాన్ని సమన్వయం చేయలేక ఇద్దరం తలలు పట్టుకునే వరకూ ఎన్ని జ్ఞాపకాల్ని వివరించను ? ఎన్నెన్ని అనుభవాల్ని వర్ణించను?. 'అంటరాని వసంతం' పై సమీక్ష రాయమని ఆయన్నెంతగా సతాయించానో, సూర్యరాయా విద్యానంద గ్రంథాలయానికి పుస్తకాలు ఇవ్వకపోతే ఊరుకునేది లేదని అంతే అల్లరి చేసాను.

పట్టుమని పాతికేళ్ళు లేని కుంక చేష్టలతో ఆయన నాకిచ్చిన చనువుని ఆధారం చేసుకుని ఎంత పెత్తనం చెలాయించే వాడినో తల్చుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఆయనే ఒకసారన్నట్లు ఆయన జీవితంలో అతి తక్కువ కాలంలో అత్యంత సన్నిహితుడిగా మారిన చిన్న వయస్సు వాడ్ని నేనే నేమో! ఎంత ఉదారంగా లేకపోతే అభ్యంతరకర పదాల్ని కూడా ఉపయోగించి ఆయనకి బహిరంగ లేఖలు రాసే ధైర్యం నాకు చిక్కుతుంది? అదంతా ఇంతకాలంగా నా గొప్పతనమే అనుకున్నా గానీ నిజానికది ఆయన ఔన్నత్యమని ఇప్పుడనిపిస్తుంది. నా రచనల్లోని పదును తగ్గించుకోవాలనీ, భాషని సంస్కరించుకోవాలనీ ఎప్పుడూ సూచిస్తుండేవారు. అలాగే ఆయన పదజాలం గురించీ, భాషా ప్రయోగాల గురించి నేను విమర్శిస్తుంటే మనసులోనే మురిసిపోయేవారు. ఆయనకంత పట్టులేదనీ, తెలీవనీ అనుకున్న సంగతుల్ని నేను చెబుతోంటే ఎంతో సహనంగా వినేవారు. తన జీవిత యవనికపై పరిచయమైన ప్రతి వ్యక్తి పాత్రనూ గుర్తించి, గౌరవించి వార్ని చివరి వరకూ, వారికి సంబంధించి తన పరిధిలోకి వచ్చిన ప్రతీ చిన్న విషయాన్నీ. స్పష్టంగా జ్ఞాపకం పెట్టుకోవడమే కాక, ఆ పెట్టుకున్న విషయాన్ని సందర్భం వచ్చినపుడు అంతే స్పష్టంగా, కూలంకషంగా జ్ఞప్తికి తెచ్చుకుని చెప్పే అరుదైన గుణం సో.సు.లో ఉండేది.

కవిత్వం, కథలు, విమర్శ, వ్యంగ్యం, సమాజం, కళ, శాస్త్రం – విషయం ఏదైనా తనకి తెలిసిన దానిని చాలా సౌమ్యంగా, గోముగా అనునయిస్తూ చెప్పడం సో.సు. గారికి చేతనయినంతగా ఇంకెవరికీ చాతకాదనేది నా అభిప్రాయం. 'ఉర్దూ సాహిత్యంలో ఉన్నత శిఖరాలు' ఆవిష్కరణ కనుకుంటాను హిందుస్తానీ గీతాల్ని నేను పాడుతుంటే చాలా ఆసక్తితో విన్నారు. తర్వాత 'భారదేశ పతనానికి పదకొండు కారణాలపై బళ్ళారి రాఘవగారి భావాలకి సో.సు. రూపాన్నివ్వడంపై చర్చిస్తూ దానికి కారణమైన అసలు ఉపన్యాసం వెలికితీయడం కోసం పూనా వెళతానంటే సంతోషంగా ప్రోత్సహించారు. కొత్త బాషలు నేర్చుకోవడం పట్ల ఆ కాలంలో నాకు గల చొరవనీ, తెల్సిన వాటిని ఆయనతో చర్చించాలన్న తపననీ ఎన్నడూ కాదనని స్నేహశీలి ఆయన. ఇక సాహిత్య రంగంలో ఆయన కృషి అనన్య సామాన్యమైంది, అసాధారణమైన ప్రతిభతో కూడుకున్నది.

సాహితీ జగత్తులో ఆయన దృష్టి ప్రసరించని అంశమింకా జన్మించలేదని ప్రతీతి. రాష్ట్రం నలుమూలల్నుంచీ అనేకమంది యువ వర్ధమాన కవులు, రచయితల్ని తనకి చాతనైన అన్ని మార్గాల్లో చివరి వరకూ ప్రోత్సహించిన ఆయన, రాష్ట్రంలోని అన్ని సాహిత్య కళా సాంస్కృతిక ప్రజా ఉద్యమాలన్నింటా తనదైన ముద్రవేసేలా డా. ఆవంత్స సోమసుందర్ లిటరరీ ట్రస్ట్' స్థాపించి భావితరాలకి కూడా స్ఫూర్తినందించే ఏర్పాటు చేయడం ఆయనలోని సాహిత్య పిపాసకి నిదర్శనం. యుద్ధమంటూ వస్తే ఎదుటివారు ఎంతటివారైనా సరే, సో.సు. నిర్మాణాత్మక అక్షర పోరాటం ముందు లొంగిపోయి ఆత్మవిమర్శ చేసుకోవాల్సిందే. తప్పుని తప్పుగా, ఒప్పుని ఒప్పుగా సూటిగా చెప్పే సో..సు, అధ్యయనం ఒక అసిధారావ్రతం, తొంభై సంవత్సరాల వయసు వచ్చినా రోజులో ఎక్కువ భాగం సాహిత్యాధ్యయనానికే కేటాయించే ఆయనకి ఎంతో మంది ప్రముఖులు శిష్యులవడం ఆశ్చర్యం అనిపించదు. After a great storm, a little lull begins' అంటూ తన చేరాతతో రాసిచ్చిన ఆత్మకథ గ్రంథాన్ని చూసుకున్నప్పుడల్లా అనిపిస్తుంది. సాంఘిక చైతన్యాన్ని నాలో ఎలా కలిగించారో. దామ్ మోరిస్ 'మై సన్స్ ఫాదర్' నుంచి నెరుడా 'మెమొయిర్స్' దాకా, జూలియస్ ఫ్యూజిక్ 'నోట్స్ ఫ్రమ్ గేలోస్' నుంచీ గోర్కీ 'చైల్డుడ్, మై యూనివర్శిటీస్' వరకూ నా చేత ఎన్ని విలువైన గ్రంథాలు చదివించారో! సో.సు. గారి భార్య

రవణమ్మ గారు చేసిన సేవని ప్రస్తావించకపోతే ఇది పూర్తి కాదు. ఆవిడ జీవించుండగా ఆయనకి చేసిన సేవలు వేటికీ సాటిరావు. ఆయనెప్పుడూ గోర్కీ జీవితం గూర్చిన సినిమాలో గోర్కీకి వాళ్ళ మామ్మ చెప్పిన వాక్యాన్నొకదాన్ని చెబుతుండేవారు. బహుశా నా జీవితంలో నన్నత్యంత ఎక్కువగా ప్రభావం చేసిన వజ్రం లాంటి వజ్రాయుధ వాక్యమది. స్వేచ్ఛగా, స్వతంత్రంగా, సత్యాన్వేషణా దృష్టితో జీవించాలనుకునే ప్రతి ఒక్కరికీ అదో ప్రమాణవాక్కు. మనల్ని మనం తెల్సుకోవడానికి మరొకరి చైతన్యాన్ని ముసుగుగా ధరించొద్దని బోధించే మహనీయ వాక్యమది. అది

"Never Hide Behind Anothers Consciousness".

(సో.సు. నివాళి వ్యాసంగా అరుణతార, సైన్సు–హేతువాదం పత్రికలలో ప్రచురించబడింది)

ఆకలి నాలుకలన్నీ... ఏకమైన రోజున ...
ఆకలి నాలుకలన్నీ... ఏకంగా ఉప్పెనలా ఉప్పొంగిన ఈ రోజున...
ధనస్వామ్య కఠోర పరిపాలన
ఛిన్నాభిన్నంగా నుసినుసిగా నశించిపోతున్నది త్వరగా.
మంత్రసాని చరిత్ర ముదుసలి
'కాలగతి' కి – గర్భవతికి పురిటి నీళ్ళు పోస్తోంది.
ప్రభవించే నూతన జగతికి పురిటిబిడ్డ... 'సమధార్మ్యనికి'
పురిటినీళ్ళు పోస్తున్నది చరిత్ర మంత్రసాని ముసల్ది.

– ఆకలి నాలుకలన్నీ (వజ్రాయుధం)

# వజ్రోత్సవ వేడుకల దిశగా వజ్రాయుధం !




కీ.శే. ఆవంత్స సోమసుందర్ యవ్వనోత్సాహంతో తెలంగాణ సాయుధ పోరాటానికీ, కర్షక కార్మిక లోకానికి మద్దతుగా, ఖబడ్దార్ ! ఖబడ్ధార్! నైజాం పాదుషా హే! అంటో గర్జించి 1949 లో అంటే కమ్యూనిస్టు మ్యానిఫెస్టో ( 1848) ప్రకటించబడిన సరిగ్గా వంద సంవత్సరాలకి ప్రచురించిన కవితా సంపుటి వజ్రాయుధం. డెబ్భై ఏళ్ళు నిండిన వజ్రాయుధం వజ్రోత్సవ వేడుకల వైపుగా సాగుతున్న సందర్భంగా ఈ సంక్షిప్త సమీక్ష. " కళ ప్రజల చేతుల్లో అజేయ ఆయుధం" (Art is an invincible weapon in the hands of People) అనే కోట్ తో సో.సు. తెలంగాణ పోరాట యోధుడు రావి నారాయణరెడ్డి గారికి వజ్రాయుధాన్ని అంకితమిచ్చారు.రాంషా ప్రకాశికతో వెలువడ్డ వజ్రాయుధం నాటి పాలకుల నుండి నిర్భంధాన్ని ఎదుర్కొని నిషేదానికి గురైంది. వజ్రాయుధంలో 1. సమధర్మం, 2. బానిసల దండయాత్ర, 3. మలయా ప్రభంజనం ఉన్నాయి. గేయాలన్నీ ఆనాడు జనాదరణ పొందాయి.

**"తన చరిత్ర తనె పఠించి**
**ఫక్కున నవ్వింది ధరణి**
**తన గాథను తనె స్మరించి**
**భోరున ఏడ్చింది ధరణి"**

వృద్ధ జగతి సమాధి పై సమధర్మం ప్రభవించును
నిద్దుర చీకటి వెలుపల వేకువ మెళకువ పుట్టును"

(సమధర్మం)

అంటూ ఆరంభించిన కవి లెనిన్ మహనీయుని "ధృవతార" గా పేర్కొంటూ,

**" ఓ లెనిన్...మా లెనిన్**

**నిరాశానలమ్మున పడి**

**అణగారే మా ఎదలన్**

**నీ వచస్సుధా లహరిన్**

**ముంచిన మహనీయ లెనిన్"**

**( ధృవతార )**

అంటారు. ఆ బాటలోనే 'ఖరార్‌నామా' కవితలో,

**"జన్మెత్తిన మానవునకు**

**జీవితమే పరమధనంబి**

**అయితే, అది ఒకమారే**

**అతని కొసగబడిన వరం"**

అంటూ మానవ జీవన సోపానం స్పష్టపరుస్తారు. అందులోనే,

**"అర్పించెయ్ నీ రక్తం మనిషీ !**

**నీ త్యాగం వృధా కాదు !**

**నీ త్యాగం వృధా కాదు !**

అనే పంక్తులు ప్రసిద్ధి చెందాయ్. భగత్సింగ్, ఫ్యాక్టరీ, మౌనఘోష వంటి కవితలన్నీ నాడు విఖ్యాతి నొందాయ్. అయితే, వజ్రాయుధం నిషేదానికి గురైంది వీటివల్ల కాదు!

"బానిసల దండయాత్ర" లో...

**" రెండు ప్రపంచాల మధ్య**

**రెండు స్వభావాల మధ్య**

**రెండే వర్గాల మధ్య**

**సాగుతున్న సంఘర్షణ**

అంటూ సమాజంలోని అసమానతల చిత్రాన్ని మొహంపగిలేట్టు చెప్పిన తర్వాత,

అంతటితో ఆగకుండా,

**“ అసుర వృద్ధ వృకోదరుల**
**అంధకార జాత్యంధుల**
**అభివృద్ధి నిరోధించు**
**ధనస్వామ్య స్వార్ధాలకు**
**అభ్యర్థుల, ప్రతినిధుల**
**ఏహ్యమాన రుజాగర్భ**
**తిరోగామి లోకమొకటి.**
**“ప్రజాతంత్ర యుగోద్భూత**
**శాంతికాల దీపికలై,**
**పీడితజన సందోహపు**
**సందేశపు ప్రతిధ్వనులై,**
**స్వాతంత్ర్యాభ్యుదయాలకు**
**శాంతిమయ వ్యవస్థలై**
**పురోగామి లోకమొకటి“**

అంటూ ఊరుకోలేదు, అణగారిన ప్రజల పక్షాన గొంతెత్తి

**“ ఒక వీరుడు మరణిస్తే**
**వేలకొలది ప్రభవింతురు!**
**ఒక నెత్తుటి బొట్టులోనె**
**ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు !**
**ఖబడ్దార్ ! ఖబడ్దార్ !!**

అని గర్జించి హెచ్చరించాడు. ఆనాటి పాలకులకే కాదు, ఏనాటి పాలకులకైనా సహించని అక్షరాగ్నులవి! అందుకే , వజ్రాయుధం నిషేదించబడి చారిత్రకంగా చిరస్మరణీయమైన విప్లవ గీతంగా వర్ధిల్లింది. ఆనాడు వేల, లక్షల సంఖ్యల్లోని ప్రజలు సభా, సమావేశాల్లో వజ్రాయుధ గీతాల్ని గొంతెత్తి పాడుకునేవారు. ఇక్కడో విషయం

ప్రస్తావించాలి. వజ్రాయుధం మొదటి ముద్రణ పొందగానే నాటి విశాలాంధ్ర పత్రికలో సెట్టి ఈశ్వరరావు గారు సమీక్ష చేసారు. అంతేకాదు, ఆనాడు తన కవితా సంపుటి పై వచ్చిన విఘాతాపూరిత విమర్శలకి సమాధానంగా సోమసుందర్, 1953 లో వచ్చిన కాహళి గీతాల గ్రంథ పీఠికగా "ఇన్ డిఫెన్స్ ఆఫ్ వజ్రాయుధం " అనే వ్యాసం రాసారు. వజ్రాయుధాన్ని స్వర్ణోత్సవ స్మృత్యంకంగా 2012 లో మొట్టమొదటి ముద్రణా ముఖచిత్రం తోపాటూ ఈ వ్యాసాన్ని కూడా చివర అనుబంధంగా చేరుస్తూ పాకెట్ బుక్ గా కళాకేళి తరపున వజ్రాయుధాన్ని ప్రచురించారు. ఆ సందర్భంగా నిర్వహించినదే బహుశా వజ్రాయుధం గురించిన చివరి సభ.

కళని ప్రజానీకపు ఆయుధంగా గుర్తించిన సోమసుందర్, సారస్వత విజ్ఞానాన్ని, సామాజిక వాస్తవికతనూ ఎప్పటికప్పుడు సమీక్షించే సాహసికమైన కార్యక్రమాన్ని జీవితాంతం కొనసాగించారు. అందుకే

"జానపద గేయాలు ఎప్పటికప్పుడు పుట్టి పెరిగి శ్రమజీవుల నాలుకల పై బ్రతుకుతున్నాయి. వాటిని సంపాదించి, ప్రచురించి పుణ్యం కట్టుకున్న దేవేంద్ర సత్యర్థి వంటి మహనీయుడు తెలుగుదేశం లో కూడా ఒకడున్నాడు. ఆయనే నేదునూరి గంగాధరం... ఈ మహోద్యమాన్ని ప్రారంభించి తగిన సహకారము, మదుపు లేక కొడిగట్టిన గుండెలతో బ్రతుకుతున్నాడు." అంటారు సో.సు.(చూడు. దేశి సారస్వతము – సమాజ వాస్తవికత, డా. సోమసుందర్ ఆవంత్స, పేజీ – 76, కళాకేళి ప్రచురణలు).నేదునూరి మనకి దూరమై 50 ఏళ్ళు కావొస్తున్నది. ఈ క్రమంలో సో.సు. దూరదృష్టితో సూచించిన గంగాధరంగారి కృషిని సాంస్కృతికంగా కొనసాగించడం అవసరం.

తుని సబ్ జైలులో ఉన్నప్పుడు 1948 లో, అంటే సరిగ్గా వజ్రాయుధాన్ని ప్రచురించడానికి ఏడాది ముందు క్రిస్టోఫర్ కాడ్వెల్ రాసిన " ఇల్యూజన్ అండ్ రియాలిటీ " ని మొదటిసారి చదివిన సో.సు. జీవితాంతం కవిత్వ తాత్వికునిగా, స్వాప్నిక భావుకుడిగానే బతికారు. ఆ గ్రంథాన్ని అనారోగ్యంతోనే అనువాదం చేశారు. సుమారు ఆరొందల పేజీల ఆ మహా గ్రంథం ముద్రణకి ప్రచురణ సంస్థలేవీ

ముందుకు రాకపోవడంతో తానే ప్రచురించారు. జార్జి థాంప్సన్ ప్రసిద్ధ గ్రంథం మార్క్సిజమూ – కవిత్వాన్ని (Marxism And Poetry) కూడా తెలుగు చేసి రెండవ ముద్రణ వరవరరావు ముందుమాటతో సో.సు. ప్రచురించిన సంగతి మర్చిపోకూడదు. సో.సు. ఇంగ్లాండ్ వెళ్ళినప్పుడు థాంప్సన్ గార్నుండీ స్వయంగా అనుమతిపొంది ఆ గ్రంథాన్ని తెలుగు చేసారు. కవుల పాలిట బైబిల్ గా పేరొందిన "కవిత్వం కాలాతీత కాంతిరేఖ" మొదలుకొని, సో.సు. అనువదించిన కాడ్వెల్ "భ్రాంతి – వాస్తవికత" వరకూ కళ సారస్వత చరిత్ర పై సోమసుందర్ గారికి గల గాఢమైన అభినివేశం ప్రస్ఫుటమౌతుంది. వందకు పైబడి పుస్తకాలు రాసినప్పటికీ సోమసుందర్ అనగానే ఎవరికైనా చప్పున గుర్తొచ్చేది వజ్రాయుధమే ! సోమసుందర్ గారితో ఎవరికెన్ని విభేధాలున్నా, ప్రజల పక్షాన నిలిచిన ఆయన అక్షరాలను ఈనాటి సాంఘిక రాజకీయ సంక్షోభాల నేపథ్యంలో సమానత్వం కోసం పాటుపడే అందరూ నెమరేసుకోవడం , ఆ స్ఫూర్తితో ఈనాటి పాలకుల అపసవ్య ధోరణులని ప్రశ్నించడం, నియంతృత్వాన్ని ఎదిరించి నిలవడమే వజ్రాయుధానికి మనం ఇచ్చే ఆత్మీయ నీరాజనం !

ఆవంత్స సోమసుందర్ కి ఇవ్వదగ్గ ఆచరణాత్మక నివాళి !!

(నవంబరు 3, ఆదివారం, డా. ఆవంత్స సోమసుందర్ లిటరరీ ట్రస్ట్ ఆధ్వర్యంలో, పిఠాపురంలోని సూర్యరాయ విద్యానంద గ్రంథాలయంలో జరిగిన సోమసుందర్ మూడవ వర్ధంతి సభని పురస్కరించుకొని వ్యాసం)

"మోదుగ పూలు" పత్రిక సౌజన్యంతో.

**ఉన్నదొక్క జీవితమే మానవునిగ, వీరునిగా బ్రతుకుము నరుడా !**
**చరిత్ర నీ కోసం ప్రసవ బాధ పడుతున్నది !**
**భవిష్యత్తు నీ కోసం పడిగాపులు పడుతున్నది !**
**అర్పించేయ్ నీ రక్తం మనిషీ ! నీ త్యాగం వృథా కాదు! నీ త్యాగం వృథా కాదు!**
**స్వేచ్ఛ కొరకు జరిగే విప్లవ సమరంలో క్షతగాత్రుడవై పడిపోయిన మనిషీ!**
**గాయపడిన సింహం వలె గర్జించిన నీ కంఠధ్వని**
**రాబోయే స్వర్ణయుగానికి జయభేరీ! నీ జీవితమొక రహదారి !**
**–ఖరార్‌నామా (వజ్రాయుధం)**

# సమసమాజమే సోమసుందర్ స్వప్నం !

**(డా. ఆవంత్స సోమసుందర్ 6 వ వర్ధంతి సందర్భంగా 12-08-2022 శుక్రవారం సాయంత్రం కాకినాడ జిల్లా పిఠాపురంలోని శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయంలో జరిగిన సభలో నా ప్రసంగ పాఠం సంక్షిప్తంగా...)**

సరిగ్గా ఇరవై ఏళ్ళ క్రితం నేను హైస్కూలు విద్యార్థిగా ఉండగా అక్కడ వివేకానందుడి జయంతి రోజున మొదటిసారి సో.సు. గారి ప్రసంగం విన్నాను. ఆ కార్యక్రమం ఏర్పాటు చేసింది కూడా సహృదయ మిత్ర మండలే. అలాగే ఈనాటి సమావేశానికి సంకల్పం చేసింది కూడా సహృదయ మిత్ర మండలే. కాన నాకు సో.సు. గారికి అనుసంధానంగా ఉన్న మిత్ర మండలికి ముందుగా నా కృతజ్ఞతలు. వేదిక పై నున్న పెద్దలకీ, సభలోని పెద్దలకి నమస్సులు !

ఈ రోజు మూడు చారిత్రక విశిష్టతల రీత్యా ఈ సమావేశం ప్రాధాన్యతను సంతరించుకుంది. మొదటిది సరిగ్గా వందేళ్ళ క్రితం 1922 లో పిఠాపురం రాజావారికి మహరాజా బిరుదు ప్రధానం చేయబడింది. ఆ సందర్భంగా జరిగిన సభలో చెలికాని లచ్చారావు గారు "దుష్ట మంత్రాంగం" నుండి జాగరూకులై వుండాలని ప్రభువులని హెచ్చరించగా, కోపంతో రాజావారు దుష్టమంత్రాంగం అని ఎవరిని ఉద్దేశించి



అన్నారో ఆ దివాన్ గారి ఉద్యోగం శాశ్వతం చేస్తున్నట్లు ప్రకటించి లచ్చారావుగారికి కోటలోకి ప్రవేశాన్ని నిషేధించారు. ఈ రోజు అంతకు మించిన దుష్ట మంత్రాంగాలు సమాజం అంతటా ఉన్నాయి !

ఇక రెండు 1922 లోనే ఆంధ్రా షేక్స్పియర్ పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి అధ్యక్షతన పిఠాపురంలో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు సమావేశం. అందులో ఆయన చేసిన అద్భుతమైన ప్రసంగం. మూడోదీ, ముఖ్యమైనది ఈ మన గ్రంథాలయానికి సంబంధించిన విశిష్టమైన విషయం ఏమిటంటే, 1915 లో విద్యానంద గ్రంథాలయం ఏర్పడింది. తర్వాత సూర్యరాయ గ్రంథాలయం ఏర్పడింది. ఈ రెండు గ్రంథాలయాలు సంయుక్తంగా ఒకే గ్రంథాలయంగా ఏర్పడి శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయంగా రూపాంతరం చెందడం 1922 లోనే జరిగింది. కాన ఈ లైబ్రరీకి సిసలైన శతవార్షికోత్సవ సందర్భం ఇదే !

ఈ క్రమంలో సరిగ్గా 1933 వ సంవత్సరం మాధవస్వామి గుడి ఎదురుగా ఉన్న ఖాళీ స్థలం లో కొద్దిమంది పిల్లలు క్రికెట్ ఆడుతున్నారు. బంతి దగ్గర్లోని తాసీల్దార్ గారి ఇంట్లోకి వెళ్ళి పడింది. తేవడానికని వారింటికి వెళ్ళిన అబ్బాయి తో మీ అమ్మగార్నడిగి పులిహోర చేయించుమన్న ఆ తాసీల్దారుగారు తరువాత పట్టణంలో జరిగిన ప్రముఖ నాటకోత్సవాలు అన్నింటికీ ఆ అబ్బాయిని ఆప్యాయంగా తమ కుటుంబంతో పాటు తీసుకుని వెళ్ళేవారు. అలా చిన్నతనంలోనే ఒక గొప్ప సాంస్కృతిక స్థాయి, కళాభిరుచి ఏర్పడటానికి అరమరికలు లేని ఆ స్నేహం నిదర్శనంగా నిలిచింది. ఆ అబ్బాయి పేరు ఆవంత్స సోమసుందర్ కాగా ఆనాటి తహసీల్దారు లాల్ అహమద్ గారు. ఒక మనిషి మహాకవిగా రూపొందే క్రమంలో మతసామరస్యత పోషించిన పాత్రని ఈ రోజు గుర్తించడం అవసరం!

ఇక 1944లో కోల్కతా లో జరిగిన స్టూడెంట్ ఫెడరేషన్ సభలకి వెళ్ళినప్పుడు అక్కడ హౌరా బ్రిడ్జి పై జీవచ్ఛవంగా పడున్న ఒక దీనుడ్ని చూసి అప్పటిదాకా భావ కవిత్వంలో కొట్టు మిట్టాడుతున్న సో.సు. ఒక్కసారిగా తనలో నుండి ఉప్పొంగిన

భావాలకు అక్షరాలుగా మలిచారు. అదే 'మౌనఘోష' నే కవితగా వ్యక్తమైంది. అంతేకాదు వజ్రాయుధం లోని ఇతర కవితలన్నింటికీ కూడా ఆసక్తికరమైన నేపథ్యాలు ఉన్నాయి. ఆస్తుల పంపకాలప్పుడు శంఖవరంలో ఉన్న ఆయన What is Philosophy పుస్తకం చదువుతూ అందులో జర్మన్ తత్వవేత్త హెయినే రాసిన ఒక వాక్యంతో ప్రభావితం అయ్యీ రాసిన అద్భుతమైన కవితే 'ఖరార్నామా'. మనిషికి ఉన్నదొక్క జీవితమే అని నినదిస్తుందా కవిత. కవిత్వంలో మొదటిసారి వర్గ దృక్పధాన్ని స్పష్టంగా చెప్పిన కవాయిన. అందుకే, "రెండు ప్రపంచాల మధ్య, రెండు స్వభావాల మధ్య, రెండు వర్గాల మధ్య సాగుతున్న సంఘర్షణ.." అంటారు. కమ్యూనిస్టు మ్యానిఫెస్టోకి కనుక కవితా రూపం ఇస్తే బహుశా అది వజ్రాయుధం లానే ఉంటుందేమో. గతంలో వజ్రాయుధానికి వజ్రోత్సవం పేరిట వ్యాసం రాసాను. త్వరలోనే వజ్రాయుధానికి వజ్రోత్సవ వేడుకలు నిర్వహించుకోగలమని ఆశిస్తున్నాను. నిజానికి వజ్రాయుధం వరకే సో.సు. ని పరిమితం చేయడం అపారమైన ఆయన పాండిత్యానికి అన్యాయం చేయడనే అనిపిస్తుంది నాకు.ఎందుకంటే ఆయన వంద గ్రంథాల్ని వివిధ ప్రక్రియల్లో రాసినవాడు, అద్వితీయ కవి, రచయిత, విమర్శకుడు, అనువాదకుడు, కళావేత్త, తాత్వికుడు, స్వాప్నికుడు ఇంకా ఎన్నో. కమ్యూనిస్టు రాజ్యాలు కూలి పోయినప్పుడు పార్టీల్లో చీలికలు వచ్చినప్పుడు "సీకింగ్ మై బ్రోకెన్ వింగ్స్" (Seeking my Broken Wings) అంటూ హృద్యంగా దానిని వ్యక్తం చేసారు. నాకు తెలిసీ ప్రపంచ సాహిత్యంలో అంత చక్కగా ఆ ఘటనని వర్ణించిన కవి మరే దేశంలోనూ ఏ భాషలోనూ లేరు. ఆ కవితా శీర్షిక కోసం ఆయన్ని 'అంటే మీరు కమ్యూనిజాన్ని రెక్కలూడిపోయిన పక్షితో పోల్చారా?' అనడిగిన ప్రశ్నకు ఆయన, 'కాదు, ఎప్పటికైనా పునరుజ్జీవనంతో రెక్కలు కట్టుకు ఎత్తుకేగే పక్షితో పోల్చానంటారు. అందుకు జీవితంలో తనని నడిపించినవి రెండు ఒకటి కవిత్వం మరోటి కమ్యూనిజం అని చివరి నిముషాన కూడా ప్రకటించాడాయన !

వ్యక్తిగతంగా ఆయనతో ఉన్న అనుబంధాన్ని వర్ణించాలంటే సమయం చాలదు. పదేళ్ళకి పైబడిన అనుబంధం ఆయనతో నాది. వజ్రాయుధం పంచమ ప్రచురణకి సిగార్ తో ఉన్న ఆయన ఫొటోను ఎంపిక చేసింది నేనే. అప్పటికే

అనేక ఏళ్ళుగా ముద్రణకు నోచుకోని వజ్రాయుధాన్ని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ బ్రాంచిలు అన్నింటికీ పోస్టు కార్డులు రాయడం ద్వారా ప్రచురణయ్యేలా ప్రయత్నం చేసింది నేనే. తాను అపురూపంగా దాచుకున్న శ్రీశ్రీ ఆటోగ్రాఫ్ నాకు ఇవ్వడం మొదలు ఎన్నో జ్ఞాపకాల వెల్లువని ఇలా ఒక సమావేశం లో వ్యక్తం చేయడం సులభం కాదు. జార్జి థాంప్సన్ మార్క్సిజం – కవిత్వం మొదలు క్రిస్టోఫర్ కాడ్వెల్ ఇల్యూజన్ – రియాలిటీ (భ్రాంతి – వాస్తవికత) దాకా, బెర్టోల్డ్ బ్రెష్ట్ అమ్మ మొదలుకొని షెల్లీ ఏరియల్ వరకూ ఎన్నో అమూల్యమైన గ్రంథాలను తెలుగు చేసారు. సాహిత్య విమర్శని సో.సు. లాగా అధ్యయనం చేసిన వారనే మాటటుంచి ఆ దరిదాపుల్లోకి రాగలవారు కూడా ఈనాటికీ లేరు.పరిశోధన విషయంలోనూ అంతే. గురజాడ కన్యాశుల్కం లోని పూర్రిచ్చర్డ్ పద ఆదుపాదులు తేల్చడం మొదలు గోదావరి జలప్రళయ రక్షకుడుగా పేరొందిన వెంకటరెడ్డి, జోగయ్యల్ని వెలుగులోకి తీసుకురావడం వరకూ ఎంతో గొప్ప లోతైన శోధన ఆయనది. వందకి పైబడి పుస్తకాలు రాసి ప్రచురించినా ఎన్నడూ ఏ పత్రిక్కీ పంపింది లేదు. తానుగా పేరు కోసం పాకులాడిందీ లేదు. జ్ఞానపీఠ్ ఆయనకి రాకపోవడం ఆ అవార్డు కి అగౌరవం అని నా అభిప్రాయం!

గోర్కీ స్వీయచరిత్ర మూడు భాగాల నుండి ప్రేరణ పొందిన సో.సు. తాను కూడా మూడు భాగాలుగా ఆత్మకథ రాయాలని అనుకున్నారు. కానీ రెండు భాగాలే రాయగలిగారు. అందులో కూడా మొదటి భాగం 'కలలు – కన్నీళ్ళు' చాలా హృద్యంగా మలిచి న్యాయం చేసారు.తెలుగు సాహిత్యంలో ఒక కవి స్వీయచరిత్ర రాసి మెప్పించడం అరుదు. దానిని సుసాధ్యం చేసారు సో.సు. అందరూ తప్పకుండా చదవాల్సిన స్వీయచరిత్ర అది. రెండో భాగానికి అనారోగ్య కారణాల వల్ల న్యాయం చేయలేక పోయారు. తొంభై ఏళ్ళ జీవితంలో ఎక్కువ కాలం సాహిత్యానికే అంకితం చేసిన మహోన్నత వ్యక్తి సో.సు. ఆయన కేవలం కవి మాత్రమే అనుకునే వాళ్ళకి ఒక విషయం గుర్తు చేయాలి. ఈ ప్రాంతంలో మొట్టమొదటి పారిశుధ్య కార్మికుల ఉద్యమానికి నేతృత్వం వహించిందీ, రైతు ఉద్యమాల్లో పాలు పంచుకోవడం మొదలు భావాల కారణంగా సొంత పాలకుల చేతనే జైల్లో పెట్టబడి కారాగార జీవితం గడిపి కేసులను ఎదుర్కొన్నదీ సో.సు.గారనేది గుర్తుంచుకోవాలి !

కళాకేళి పత్రికని స్థాపించడం మొదలు కళాకేళి నికేతన్ సంస్థ ద్వారా ఆరుద్ర త్వమేవాహం మొదలు ఎన్నో గ్రంథాలు ముద్రించడం, తన సమకాలీన కవి, రచయితలందరి సాహిత్యం మీదా సాధికారిక విమర్శ చేసి వాటిని పుస్తక రూపంలో ముద్రించడం, లిటరరీ ట్రస్ట్ స్థాపించి వర్ధమాన కవులు, రచయితల్ని ప్రోత్సహించడం ఆయన నిర్వహించిన అసంఖ్యాక పాశ్వాల్లో కొన్ని మాత్రమే. సూటిగా స్పష్టంగా జీవించిన ఆయన ఎప్పుడూ రాజీ ధోరణిని అవలంబించింది లేదు. తెలంగాణ పోరాట కాలంలో వేలాది మంది ప్రజలు పాల్గొన్న ప్రతి సమావేశం లోనూ వజ్రాయుధ గేయాల్ని ఎలుగెత్తి పాడుకునే సంప్రదాయం ఉండేది. అలాంటిది ఈ రోజు సొంత గడ్డ మీదే సోమసుందర్ పేరు తెలిసిన వారు తక్కువ. 'శాస్త్ర జ్ఞానం లేని ఉత్పత్తి విషంగా మారుతుంది' అంటారు సో.సు. భ్రాంతి – వాస్తవికత కి ముందుమాటగా శీర్షిక లో. అలాంటి విషాన్ని ఈ రోజు ప్రత్యక్షంగా మనం చూస్తున్నాం కాన ఈ స్తబ్ధతని అధిగమించడం అవసరం!

వారసత్వం అనేది ఒక్కరిది కాదు, ముందుకొచ్చే ప్రతి ఒక్కరిదీ. లిటరరీ ట్రస్ట్ కార్యక్రమాల సంగతి అలా ఉంచితే కేవలం సో. సు. సాహిత్యాన్ని అధ్యయనం చేయడానికి, తద్వారా ప్రజల్లోకి దానిని తీసుకుని వెళ్ళడానికి సోమసుందర్ స్టడీ సర్కిల్ లేదా ఫోరం వంటిది ఏదైనా ఏర్పాటు చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. మిత్రులు ఆలోచిస్తారని ఆశిస్తాను. చివరగా బతికున్నన్నాళ్ళూ ఎన్నోసార్లు తిట్టుకున్నాం. మళ్ళీ కలుసుకున్నాం. బహుశా మా తాతయ్యతో కూడా నేను సో.సు.తో ఉన్నంత చనువుగా లేనేమో. ఆ అనుభవాలను అన్నింటినీ అదిలిస్తే ఇక ఆ ప్రవాహం ఆగదు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తన అనుభవాలు – జ్ఞాపకాలు లో అంటారు, 'సత్యం – శివం – సుందరం ఇంతే కవుల ధ్యేయం" అని. సో. సు. గారి జీవితానికి సరిగ్గా అతికినట్లు సరిపోయే వాక్యమది. జీవితాంతం సత్యం కోసమే బతికి శివాన్ని అంటే అందరి బాగుని ఆశించి సుందరాన్ని, జీవితంలోని సౌందర్యాన్ని పరిపూర్ణంగా ఆస్వాదించిన మహామనీషి సో.సు. ఆయనకిదే నా ఆత్మీయ నీరాజనం, సెలవు.

"సకలం" వెబ్ మేగజైన్ సౌజన్యంతో.

# నాటకరంగ తరంగాలు !

**(డా.చాట్ల శ్రీరాములు పుస్తక పరిచయం)**




"లలితకళల్లో ముఖ్యంగా ప్రదర్శన కళల్లో సంగీతంలో సంగీతమే ఉంది.నాట్యంలోనాట్యమే ఉంది.దృశ్య కళలైన చిత్రలేఖనంలోచిత్రలేఖనమే ఉంది. శిల్పకళలో శిల్పమే ఉంది.కాని, నాటకకళలో కేవలం నాటకమే కాదు, సంగీతం, నాట్యం, చిత్రం, శిల్పం ఆఖరికి మార్షల్ ఆర్ట్స్ అన్నింటినీ తనలో నిబిడీకృతం చేసుకున్న కళ. దర్శకుడూ, ప్రయోక్త ఒక్కరే అనుకుంటే దర్శకుడు నిర్మించిన సర్వకళల సమ్మేళనా భరితమైన దివ్యభవ్య హర్మ్యం నాటకం!". (పేజి 16)

"తొలి నాటకాన్ని నిరక్షరాస్యులే నిర్మించు కున్నారు. అదో అద్భుతమైన జ్ఞాపకశక్తి. కాలం, జ్ఞాపకశక్తి, అనుభవం కలగలిపిన అల్లిక అది. మాటకో రూపం ఉంది. పాటకో రూపం ఉంది. ఆటకో రూపం ఉంది. తెలుగు నాటకం ఆ మూడు రూపాలతో నిర్మించ బడింది. ఒక తరం మరో తరం వారికి ఆ రూపాన్ని అందిస్తూ వెళ్ళి పోయింది. అందుకున్న తరం ఆ రూపాన్ని అభివృద్ధి చేసింది. ఏ ఒక్క మహాకవో కూర్చొని రాయలేదు. ఒక్క మాటకు వంద మాటలు కలిసాయ్. తెలుగు నాటకం అక్కడే ప్రాణం పోసుకుంది !" (పేజి 17)

"విభిన్న రుచులుగల జనులందరికీ ఏకపాత్ర సమారాధనం చేసేది నాటకం అన్నాడు మహాకవి కాళిదాసు. మనిషిని ఆలోచింప జేసేది,ఆహ్లాదపరిచేదీ, సన్మార్గాన నడిపించేదీ, మనిషి లోని తప్పుల్ని ఎత్తి చూపేదీ, అంతరాత్మని తరచి చూసు కోవడానికి మార్గదర్శి అయినదీ, ఆత్మ జ్ఞానం పెంపొందించేదీ, చివరికి మనిషిలో దేవుణ్ణి చూడగలిగేదీ నాటకం ద్వారానే సాధ్యం !" ( పేజి 25)

“వీధినాటిక ప్రక్రియ జన్మస్థలం ఆంధ్రదేశం. వేష భాషలు ధరించకుండా తిరునగరి రామాంజ నేయులు రచించిన ‘వెట్టిచాకిరీ’ అనే నాటికను 1949 తెలంగాణ సాయుధ పోరాటం ఉద్యమం లో భాగంగా నల్గొండ జిల్లాలో మొత్తం 100 సార్లకి పైగా ప్రదర్శించారు. యావత్ భారతదేశం లో ప్రప్రథమంగా వీధినాటకాన్ని ప్రదర్శించిన ఘనత మనదే. సఫ్దార్ హష్మీ ఆద్వర్యంలో ప్రచురించబడ్డ The Right to Perform అనే పుస్తకంలో బెంగాల్ లో వీధినాటకం మొట్టమొదటి సారిగా ఉత్పల్ దత్ భారతదేశంలో జరిగిన రెండవ విడత సాధారణ ఎన్నికల్లో ప్రదర్శించారని వారే రాసుకున్నారు. ఇది చారిత్రక సత్యం..!” (పేజి 109)

------------

డా. చాట్ల శ్రీరాములు చిన్న వ్యక్తి కారు. నాటక రంగంలో అపారమైన అనుభవం ఉన్న వ్యక్తి. కీ. శే. ఆవంత్స సోమసుందర్ గారు తన 90 వ జన్మదినం సందర్భంగా శ్రీరాములుగారికి పురస్కారం ప్రధానం చేసారు. ఆ తర్వాత కళాకేళి నికేతన్ (పిఠాపురం) తరపున పెద్దలు కీ. శే. గొల్లపూడి మారుతీరావు రాసిన మున్నుడితో అద్భుతమైన శ్రీరాములు గారి వ్యాసాల్ని గుదిగుచ్చి 2015 లో పుస్తకంగా ప్రచురించారు. అప్పట్లో హైద్రాబాద్ రవీంద్రభారతిలో జరిగిన సమావేశంలో ఏదో కార్యక్రమంలో భాగంగా తప్పా ఈ పుస్తకం కోసం ప్రత్యేకంగా చర్చంటూ జరగలేదు!

------------

కథ అక్కడితో అవలేదు. డా.చాట్ల శ్రీరాములు, డా. ఆవంత్స సోమసుందర్, గొల్లపూడి మారుతీరావు గతించారు. విలువైన పుస్తకం కోసం ఎవరూ పట్టించుకున్నది లేదు. ఎంతో ఇష్టంగా సో. సు. ప్రచురించిన పుస్తకం మరుగున పడిపోయింది. అసలు చాట్ల శ్రీరాములు గారి వ్యాసాల్ని ఆవంత్స సోమసుందర్ ఇష్టంగా పిఠాపురం, కళాకేళి నికేతన్ తరపునుంచి ప్రచురించిన విషయం కూడా తెలీకుండా పోయింది. వందలకొద్దీ ప్రింటయిన గ్రంథాలు అక్కడ చెదలు చదూతున్నాయ్. మొన్న అనుకోకుండా చేతికొచ్చిన పుస్తకం చూసి రచయిత విద్వత్తుకు మతిపోయింది !

------------

ఇంత మంచి పుస్తకం ప్రజల మాటటుంచి కనీసం కళల మీద, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో అభిలాష ఉన్నవారికి, ముఖ్యంగా నాటకంకోసం ఆశక్తి కల్గినవారి దరికిచేరి, ఆ మేరకయినా కనీసం చర్చ జరిగితే మేలనే ఉద్దేశంతో సుమారు 4000 విలువ చేసే సోమ సుందర్ కొన్ని రచనలతోపాటు ఈ పుస్తకాన్ని కూడా ఆయన వర్ధంతి రోజున జరిగిన కార్య క్రమంలో వక్తలకి ప్రత్యేకంగా అంద జేయడం జరిగింది. ఈ రచన గురించి త్వరలోనే పూనుకొని నిర్మాణాత్మకమైన విశ్లేషణాత్మక సంవాదం జరగాలని ఆశిస్తూ అమూల్యమైన ఈ రచన కోసమిలా చిరు పరిచయం. ఎందుకనేది ఆయన మాటల్లోనే,

"నాటకరంగంలో 'నేను' పదాన్ని విస్మరించి ఆ పదం స్థానంలో 'మేము' పదాన్ని insert చేస్తే తప్ప ఏ దేశంలోనూ నాటకం రాణించదు !"

---

**ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు !**
**ఒక నెత్తుటి బొట్టులోనే ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు !**
**ఖబడ్దార్! ఖబడ్దార్ !**

**– బానిసల దండయాత్ర (వజ్రాయుధం)**

**పాపం పండిన ఈ లోకపు**
**నెత్తిమీద నిండుకుండ**
**రేపో ఎల్లుండో**
**భళ్ళున బద్దలవక మానదు**

**లేనివాళ్ళ నరాల రక్తం**
**సారా త్రాగి త్రాగి మత్తెక్కిన**
**కలవారల పొగరుమోతు లోకం**
**రేపో ఎల్లుండో కూలిపోక మానదు."**

**–బాడుగ గోడీలు (వజ్రాయుధం)**

# ఆకాశమంత అక్షరమూర్తి

## డా.ఆవంత్స సోమసుందర్

### (అభ్యుదయ కవి సంక్షిప్త పరిచయం)




కవి, రచయిత : ఆ కవితావేశానికి బెదిరి పోయిన ప్రభుత్వం ఆయన కవిత్వాన్ని నిషేధించింది . ఐనా, పదుల సంఖ్యలో ఆయన కవితా సంపుటాలు ప్రచురించారు. జీవితమే కవిత్వంగా బతికారు. ఒంటిచేత్తో ఏకంగా అక్షరాలా వందకి పైబడి పుస్తకాల్ని ప్రచురించిన వ్యక్తి !

ఉద్యమకారుడు : ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ తరపున పీడిత ప్రజానీకం కొరకు గొంతెత్తడం మొదలు పారిశుధ్య కార్మికుల సమస్యల వరకూ, అణగారిన వర్గాల పక్షాన న్యాయ పోరాటం చేయడం నుండీ, అభ్యుదయ రచయితల సంఘానికి అధ్యక్షునిగా ఆయన రూపొందించిన కార్యక్రమాల వరకూ అన్నింటా ఆయన ఒక ధిక్కారమే !

విమర్శకుడు : గురజాడ, వీరేశలింగం, శ్రీశ్రీ, నారాయణ బాబు, కొ.కు, పురిపండా, తిలక్, చలం, కృష్ణశాస్త్రి, అనిశెట్టి, రవీంద్రనాథ్ టాగూర్, శరత్, హెన్రిన్ హెయినీ, బుద్ధదేవ్ బోస్, సుబ్రహ్మణ్య భారతి, హరిన్ చటో, వంటి మహామహుల పై సమగ్రంగా ఒక్కొక్క గ్రంథం సాధికారికంగా రాసిన వ్యక్తి. ఆంగ్లంలో విమర్శ కోసం ఆయన చేసిన అధ్యయనం అద్వితీయం అంటారు !

అనువాదకుడు : ప్రఖ్యాత జర్మన్ సాంస్కృతిక శీలి బెర్తోల్ బ్రెష్ట్ 'అమ్మ' నాటకాన్ని,ఎర్నెస్ట్ టోలర్ మందీ– మనిషీ నాటకాన్నీ, తెలుగు చేసిన గొప్పవ్యక్తి.

గోథే మహాకవి రచన శోకతరంగాలు పేరిట అనువదించినాయన. ప్రఖ్యాత మార్క్సిస్ట్ మేధావి క్రిస్టోఫర్ కాడ్వెల్ ఇల్యూజన్ రియాలిటీ 'భ్రాంతి – వాస్తవికత' గా అనువదించిన మహా కృషీవలుడు. మహాకవి షెల్లీ కావ్యాన్నే కాక షెల్లీ జీవితం గురించిన అద్భుతమైన నవల 'ఏరియల్' ని తెలుగు వారికి అందించిన గొప్ప అనువాదకుడు !

పరిశోధకుడు : లియొనార్డో డావిన్సీ గురించి శోధించిన వ్యక్తి.కన్యాశు ల్కంలో గిరీశం వాడిన పూర్రిచ్చర్డ్ ఆదుపాదుల్ని వెలికితీసి తెలుగు సాహిత్య లోకానికి అందించిన వ్యక్తి. నూరు శరత్తులు,ఆ తరం కవితా తరంగాలు, శరచ్చంద్రిక, దేశీ సారస్వతము – సమాజ వాస్తవికత వంటి గ్రంథాలు ఆయనలో శోధనకు ప్రతీకలు!

ప్రయోగశీలి : ఆయన రచనలేవీ అచ్చు వేయరాదనీ ఉభయ గోదావరి జిల్లాల్లో ప్రభుత్వం ప్రెస్సులకి తాఖీదు ఇచ్చిన సందర్భంలో తెనాలిలో ప్రచురించిన ఏకైక కథా సంపుటి 'బానిసల దేశం'. రష్యా విఫల వామపక్ష ప్రయోగాన్ని 'సీకింగ్ మై బ్రోకెన్వింగ్స్' అనే ప్రయోగాత్మక కావ్యంగా మల్చిన వ్యక్తి. ఆయన సంపూర్ణ ప్రయోగ కావ్యం రక్తాక్షి.భారతీయ పునరుజ్జీవనానికి తోడ్పడిన మహా వ్యక్తుల జీవనరేఖలు 'వెలుతురు తెరువులు!'

ఉద్వేగి : అమరజీవి పొట్టిశ్రీరాములు త్యాగానికి మద్దతుగా 'కాహళి', అరసం – విరసం వివాదం గురించి రాష్ట్రమంతా పర్యటించి వచ్చిన ప్రశ్నలు – జవాబుల్ని 'సాహిత్యంలో సంశయ కల్లోలం', ఇంగ్లాండ్ పర్యటన ఆరుద్రగారితో చేసొచ్చి 'ఆంగ్ల సీమలో ఆమని వీణలు',బాబ్రీ మసీదు, మతకలహాల నేపథ్యంలో 'చేతావని', 'రక్షరేఖ' రైల్లో బాంబు దుస్సంఘటన గురించి 'ధూపఛాయ' కవిగా ఆయనలోని మానవీయ స్పందనకి చిహ్నాలు !

రసజ్ఞుడు :'కవిత్వం కాలాతీత కాంతిరేఖ' ఈనాటికీ ఎందరో కవులకి ఒక దిక్సూచి. 'ఉర్దూ సాహిత్యంలో ఉన్నత శిఖ రాలు'హిందుస్తానీ కవిత్వంలో ఆయన పరిచయానికి తార్కాణం. గవాక్షంలో అంతరిక్షం, కెరటాలు – కిరణాలు ఆంగ్ల సాహిత్యంలో ఆయనకున్న గాఢతకు సాక్ష్యాలు. భారతీయ శాస్త్రీయ సంగీతం పై ఆయన సాధికారికతకి ప్రమాణం, 'హంసధ్వని'!

కార్యశీలి : 1953 లో సంభవించిన వరద ముంపు గ్రామాల్ని స్వయంగా వెళ్ళి చూసి 'గోదావరి జల ప్రళయం' అనే కావ్యం రాసిన కవి. కళాకేళి పత్రిక వ్యవస్థాపకులు. ప్రముఖ తత్వవేత్త జార్జి థామ్సన్ ని స్వయంగా ఇంగ్లాండ్ లో కలిసి ముచ్చటించి ఆయన రచన మార్క్సిజం – కవిత్వాన్ని తెలుగులో అనువదించిన మహాకవి. కళాకేళి నికేతన్ ప్రచురల ద్వారా అనేకమంది రచనల్నీ, సో.సు. లిటరరీ ట్రస్ట్ స్థాపించి తద్వారా అనేకమంది ప్రముఖ కవులు, రచయితలు, అనువాదకులు, విమర్శకులు, ఉద్యమకారుల్ని సత్కరించిన వ్యక్తి !

(ఇవికాక కలలు – కన్నీళ్ళు, పూలూ – ముళ్ళు పేరిట రెండు భాగాల స్వీయచరిత్ర మరెన్నో విమర్శనా గ్రంథాలు,భాషాసేవ, బృహత్ కావ్యాలు, ప్రయోగ గీతాలు, ప్రసంగాలు, పద్యాలు, పాటలు, బాలల గేయాలు, నవలలు, కవితాసంపుటాలు,కావ్యాలు..వంటివాట్లో నిరంతర కృషిచేసిన స్నేహశీలి, మానవతావాది.చనిపోయే వరకూ సాహిత్యంతో సహవాసం చేసిన డా.ఆవంత్స సోమసుందర్ శత జయంతి సమీపిస్తున్న సందర్భంగా ఎన్ని విభేదాలు ఉన్నప్పటికీ స్తబ్ధంగా ఉన్న కవిమిత్రులు, సాహితీ వేత్తలు కాస్త మేల్కొని ఆయన కృషి కోసం కనీసం నేటి తరాలకు తెలిపేందుకైనా కార్యాచరణ రూపొందించా ల్సిందిగా మనవి చేస్తూ ఈ చిన్న రైటప్ !)

# సోమసుందర్ నాయకంపల్లి జ్ఞాపకాలు !

## (కలలు - కన్నీళ్ళు ఆత్మకథ విశిష్టాధ్యాయం)

"నాయకంపల్లి గ్రామంలో బ్రాహ్మలూ, బ్రాహ్మణేతరులు కలిసి ఏకపంక్తిగా భోజనం చేయడం ఆ వేళే ప్రారంభ మయింది. ఆ ప్రారంభానికి కృష్ణశాస్త్రి గారే ప్రేరకులు. ఆయన హైందవ మతాన్నీ, కులాల నిచ్చెన మెట్లనీ ఎప్పుడో 1916 లోనే విడిచిపెట్టారు, ఛాందసులైన శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రి గారి శిష్యులైన వేదుల సత్య నారాయణ శాస్త్రి గార్ని కూడా సోత్రియత్వం నుంచి బయటపడేసి బాల్య వితంతువుని వివాహం చేసుకోవడానికి ప్రోత్సాహం ఇచ్చారు... నాయకంపల్లి చరిత్రకు మాత్రం అదే గొప్ప విప్లవాత్మక సంఘటన.."

**కలలు - కన్నీళ్ళు**

(279, 280 పేజీలు)





డా. ఆవంత్స సోమసుందర్ ఆత్మకథ 'కలలు – కన్నీళ్ళు.' ఈ పుస్తకానికి నేను మొదటి పాఠకుడిని. ప్రచురణకు ముందే చదివి మార్పులు చేర్పులు సూచించినవాడ్ని. నాకు స్వయంగా ఆయనే ఇంగ్లీషులో రాసిచ్చిన కాపీ మొదటి పేజీ చదివేంత వరకూ ఈ విషయం నాకు కూడా తెలీదు. అప్పటికి నా ఇంటర్ అయిందేమో. ఈ ఒక్క పుస్తకమనే కాదు, ఆయన రాసిన పదుల సంఖ్యలో గ్రంథాలు బయటకు రావడానికి ప్రధాన కారణం శ్రీమతి ఎర్రమిల్లి ఉషాకుమారి. కానీ,

ఆవిడ పేరు ఈ ఒక్క పుస్తకం ముందుమాటలోనే మనకి కనబడు తుంది. 325 పుటల పుస్తకం లో ఇతరేతర విశేషాలన్నీ ఒకెత్తూ, చివర్లో రాసిన “మధూదయంలో మంచి ముహూర్తం” ఒక్కటీ ఒకెత్తూ. ఆనూరులో కొడుకు బారసాలప్పుడు నాయకంపల్లి అనే గ్రామంలో కొత్తగా నిర్మించిన గ్రంథాలయ భవనం ప్రారంభోత్సవం కోసం ఆ ఊరి పెద్దమనుషులు సోమసుందర్‌గార్ని సంప్రదించడం, అందుకు ఆయన అంగీకరించి ఎందరో మహామహులతో చేసిన అసాధారణ మహోత్సవం గురించిన వివరణాత్మక సమాచారం సుమారు మొత్తం 30 పేజీలు !




---

(With love that was a flower of unfeeding fragrance. But there was a break with whims and fancies of Mr. M. K. Gourav who first red the manuscript of this book and responsible to publish for which I am thankful. A. Somasundar)

---

ఇది నా వరకు తెలిసిన సో.సు.గారి వ్రాత వివరణ. –మన్మథరావు

దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు మొదలుకొని పిలకా గణపతి శాస్త్రి గారి వరకూ, వేదుల సత్య నారాయణ శాస్త్రి గారి నుండి, మొక్కపాటి నరసింహ శాస్త్రి గారి దాకా, శశాంక నుండీ భావనరావు గారు, కృష్ణశాస్త్రి గారి మేన కోడళ్ళు సీత, అనసూయ, రాంషా, ఇంతమంది మహా మహులు మెత్తగా గడ్డిసర్ది ఈతాకు చాపలేసిన ఎడ్లబళ్ళ మీద నాయకంపల్లి వెళ్ళడం జరిగింది. నిజానికి పాలగుమ్మి పద్మరాజు, కలిదిండి గోపాల శాస్త్రి, హనుమత్ శాస్త్రి కూడా పాల్గొనాల్సింది కానీ

ఏవో కారణాల వల్ల రాలేక పోయారట. పాతిక పుటలకి పైగా ఆ సభా ఏర్పాట్లూ, బ్రహ్మరథం పట్టిన గ్రామ పెద్దలు నిర్వాహకులు, చౌదరి గారు, ఆవంత్స సుబ్బారావు గారు, భోజన, వసతి ఏర్పాట్లు మొదలు ఎంత ఘనంగా సభా వేదిక నిర్మించారో, ఇంకా ఇతర ఉపాధ్యాయ మిత్రుల కోసం ఆయన వర్ణించిన తీరు చదువు తూంటే అబ్బుర మనిపిస్తుంది !

నిరాశ పరుస్తుందని తెలుసు కానీ ఇంతమంది కవులు, కళాకారులు, సాహితీ ఉద్దండులతో ప్రారంభమైన ఆ గ్రంథాలయ స్థలాన్ని ఓమారు చూసి రావాలనే ఆశ చాలా కాలం నుండి నాలో ఉంది. ఈరోజు మనకి పెద్ద విషయంగా అనిపించక పోవచ్చుకానీ స్వాతంత్ర్యానికి పూర్వం ఒక మారుమూల గ్రామంలో జరిగిన ఆ కార్యక్రమం అసమానతల మీద చూపిన ప్రభావం ఎంత బలీయమైందో ఊహించ వచ్చు.కృష్ణశాస్త్రిగారి చేతుల మీద ప్రారంభించబడిన ఆ ఊరి గ్రంథాలయం, తదనం తరం జరిగిన మహత్తరమైన సాహిత్య సభ, సోమసుందర్ గారికి ఒక జీవితకాలపు జ్ఞాపకం. అంతటి గ్రామాన్ని ఒకసారి పలకరించినట్లుం టుందని కవి మిత్రులు, సోమ సుందర్ లిటరరీ ట్రస్ట్ బాధ్యులు మేకా మన్మధరావు గారూ నేనూ బయలుదేరి మొన్నా ఊరికి వెళ్ళాం !

ఇప్పుడా ఊరు రెండైంది, పాతూరు, కొత్తూరు.ఏ ఊర్లోనూ లైబ్రరీ ఊసే లేదు. ఊరి చివర పాడుబడిన మొండి గోడలు చూసి గుండెల్లో ఎక్కడో కలుక్కుమంది. దసరా ఉత్సవాల్లో భాగంగా లైబ్రరీ మొండి గోడలకి ఎదురుగానే ఊరందరికీ ఆరోజు అన్నదానం అని హడావుడి నడుస్తోంది. మా



వివరాలు తెల్సుకుని అల్పాహారం అందించారు. ఎనభై ఏళ్ళ కిందటి చరిత్ర. ఎవరికి తెలుస్తుంది? ఊర్లో కొద్దిమందిని కలిసాం. ఆవంత్స సుబ్బారావుగారి అబ్బాయి వెంకట్రావుగారి చిరునామా పెద్దాపురంలో వెతికి పట్టుకుని ఆయనకి శతజయంతి కార్యక్రమం ఆహ్వానం ఇస్తే సంతోషించారు. సోమసుందర్ బంధువులామె ఎనభై ఏళ్ళ పెద్దావిడ్ని మళ్ళీ వెనక్కి వెళ్ళి ఆనూరులో కలిసి ఆహ్వాన కరపత్రం, కలలు – కన్నీళ్ళు పుస్తకం అందించాం.అంతటి చారిత్రక ప్రాధాన్యత కలిగిన ప్రదేశం కోసం ఈ రోజు తెల్సిన వారు ఒక్కరంటే ఒక్కరు కూడా లేకుండా పోవడం నిజమైన విషాదం !

(కుల అంతరాల్ని అధిగమించడానికి ఆ రోజు జరిగిన సహపంక్తి భోజనాలు చూపిన ప్రభావం ఎంతటిదో సోమసుందర్ రాసారు కాన, ఇదేదో కేవలం ఒక గ్రంథాలయం గురించిన విషయం కానే కాదు.సామాజిక చైతన్య క్రమంలోనూ ఈ దేశ సాంస్కృతిక పరిణామంలోనూ ఆరోజు గ్రంథాలయాలు పోషించిన మహోన్నతమైన పాత్రను నిజాయితీగా గుర్తించడం. సంఘ సంస్కరణోద్యమాల్లో భాగంగా విశాల దృక్పథం తో కొనసాగిన విస్తృత మాన వోద్యమ యత్నాలకి సంబంధిం చిన ప్రయత్నాల్ని ఆ మేరకు నిజాయితీగా గౌరవించడం. అన్నిటి కన్నా ముఖ్యంగా నూరేళ్ళ శత జయంతి ఉత్సవాలను జరుపుకుంటున్న విస్మృత కవితా వజ్రాయుధుడు డా.ఆవంత్స సోమసుందర్ స్మృతిలో ఆయన ఆశయాలకి పునరంకితం కావడం. అందుకోసమే నాయకంపల్లి జ్ఞాపకాల ఫొటోలతో ఈ చిన్ని రైటప్ !)

**కాలం వలె మానవుడూ అమరుడు**
**ఎర్రపడిన తొలివేకువ తెల్లారే లోపల**
**ఉదయకాంతి హాసంలో, ఉషోమూర్తి వేషంలో,**
**ప్రజ్వలుడై మానవుడే కాలం వలె ఉదయిస్తాడని**
**చరిత్ర చెవిలో రహస్యాన్ని ఊదినదే !"**
**– వజ్రాయుధం**

# వజ్రాయుధ కవి శతజయంత్యుత్సవ సదస్సు!

## (డా.ఆవంత్స సోమసుందర్ ఆత్మీయ లేఖ)

కొన్ని జ్ఞాపకాలు కాలాతీతమైనవి. కొందరు వ్యక్తులు ప్రేమాస్పదులు. నెయ్యమైనా, కయ్యమైనా సరే వారితో సఖ్యతగానే ముగుస్తుంది. వజ్రాయుధ కవి డా. ఆవంత్స సోమసుందర్ పదిహేడు సంవత్సరాల క్రితం హైదరాబాదులో నేను ఉంటున్న కాలంలో అభిమానంగా రాసిన లేఖ ఇది. అప్పటికి చేగువేరా (బహుశా రష్యన్ నుండి ఇంగ్లీష్ అనువాదం) అలాగే ఆస్కార్ వైల్డ్ పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే చదివినట్లుంది. షెల్లీ ఏరియల్ మొదటి భాగం పూర్తిచేసి నేనే నగేష్ అనే అబ్బాయిని ఆయన దగ్గర రాతకి కుదిర్చాను !

అభ్యంతరకరమైన పరుష పదజాలంతో సో.సు.కి రాసిన ఉత్తరాలిప్పుడు తల్చుకుంటే ఏదో ఒక బాధ. అంత పెద్దమనిషిని పట్టుకుని అన్నన్ని మాటలెలా అనగలిగానో, అసలాయన ఎలా ఊరుకుని మళ్ళీ నన్ను గారం చేసారో అనేంత ఆశ్చర్యం. ఎంత పొగరు కాకపోతే రాసిన లేఖ లో పదాలకి అర్థాలు కూడా ఇచ్చేంత అహంకారం ఆ కుర్ర వయసుకి ? ఇప్పుడవన్నీ ఎంత గుర్తుకొచ్చి గుచ్చుకుంటాయో. శతజయంతి సందర్భంగా నెమరేసుకున్నకొద్దీ నెమ్మదిగా నెమలీకల్లా మనసుని తాకుతున్నాయో అనే ఆలోచనల లోతైన తరంగాల ఝరి !

జీవితాంతం సాహితీ సేవ చేసిన ఆ యోధుడి ఆశయాల మాటటుంచి అక్షరాలు సైతం ఎంత విస్మరించడం జరిగిందంటే, లక్షలాది పుస్తకాలు చెదలు పట్టిపోయాయ్. తూగుటు య్యాలలో అనేక మంది అభిమానులు, శ్రేయోభిలాషులకు కబుర్లు చెప్పిన ఆయన నివాసగృహం పూర్తిగా శిథిలావస్థలో ఉంది. టేకు బీరువాల్లో కొత్తగా మెరిసిపోతున్న మంచి పుస్తకాలన్నింటినీ చెదలు తినేస్తు న్నాయి. ఇప్పుడెవరూ ఇక వాట్ని చదివేందుకు లేరు, రారన్నట్లుగా మొత్తం అక్షరాల్ని ఆక్రమించుకొని స్వాహా చేస్తున్నాయ్. మహాకవి భావాలకి పట్టిన అధోగతిది. ఈ స్థితిని అధిగమించడం ఆలోచనాపరులందరి ఉమ్మడి బాధ్యత. అందులో భాగమే ఆయన శతజయంతి కార్యక్రమం !

సాహిత్యమే జీవితంగా భాసించిన అక్షరమూర్తి అనితరసాధ్యమైన కృషికి ఆశయ నీరాజనం ఈ కార్యక్రమం. సేచ్ఛగా అక్షరాల్ని సృజించి, స్వతంత్రంగా తన భావాల్ని ప్రవహింపజేసిన కవితా బాంధవుడి అపారమైన స్ఫూర్తికి ఆశాచిహ్నం ఈ సమావేశం. కాబట్టి,దగ్గర్లోని సాహితీ మిత్రులు, సామాజిక ఆలోచనా పరులు తప్పక రండి. రచనావ్యాసంగాన్నే ఊపిరిగా చేస్కున్న మహోన్నత కవి, రచయిత, విమర్శకుడు, తత్వవేత్త, విశ్లేషకుడు, ఉపన్యాసకుడు, కళావేత్త, పరిశోధకుడు, ఉద్యమకారుడు, పత్రికా సంపాదకుడు, ప్రచురణకర్త...డా. ఆవంత్స సోమసుందర్ గారికి ఆత్మీయ నివాళులు అర్పించేందుకు ముందుకు రండి !

Dr. Avantsa Soma Sunder
Kalakeli Niketan, Pithapuram
PIN 533450

WATER IS 1st!
PAY WATER BILL FIRST

(చాలా కాలం తర్వాత దొరికిన ఈ ఉత్తరం నాకొ అమూల్యమైన జ్ఞాపకం.

ఇంకా రాత రూపంలో లేని అద్భుతమైన సంభాషణలు, సద్గోష్టులు మా మధ్య ఎన్నున్నాయో. అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపుండీ, తరగని ఆస్తిపాస్తులుండీ, అవకాశం ఉండి కూడా ఏదోక పేద్ద నగరంలో స్థిరపడాలని ఆయన అనుకోలేదు. పైగా బతికినంతకాలం పిఠాపురాన్నే తన కార్యక్షేత్రం చేసుకున్నాడు. ఇక్కడి ప్రజల్ని ప్రేమించాడు, ఇక్కడి జనాల తో జీవించాడు. ఆయన వజ్రా యుధుడు, చాలా మంది మరుగుజ్జు మనసున్న వారికి అర్థం చేసుకోవటానికి సమయం పడుతుంది కానీ ఆయన వ్యక్తిత్వం సారస్వత సమర్పితం. అందుకే ఆయన జీవితం, చేసిన కృషిని తలచు కుంటూ ఈ చిన్న రైటప్ !)

# డా. ఆవంత్స సోమసుందర్
# వజ్రాయుధం ఐదో ముద్రణ
## (పుస్తకం ప్రచురణ వెనక చిన్న కథ ! )

ఇరవై ఏళ్ళ క్రితం సంగతి. అప్పటికి ఆవంత్స సోమసుందర్ గారి 'వజ్రా యుధం' అంటే ఒక్క సాహితీ సమూహాల్లోనే కాదు, ఉద్యమ శ్రేణుల్లో కూడా ఒక విధమైన ఆరాధన. అంత త్వరగా కొరుకుడుపడే భాష కాదు సో.సు.ది. అయినా మహాప్రస్థానం లాగా వజ్రా యుధాన్ని చదవడం అంతకు దశాబ్దాల ముందే ఒక పేషన్. నిజం చెప్పాలంటే అప్పటికే తెలుగు సాహితీ లోకంలో తప్పా సాధారణ పాఠకప్రపంచానికి అంతగా తెలియదు. అయితేనేం, ఎంతైనా చరిత్ర సృష్టించిన రచన కదా. కాబట్టి చారిత్రక ప్రాధాన్యత ఉండనే ఉంది. అయితే, అప్పటికి ఇంకా ఐదో ప్రచురణ రాలేదు.వజ్రాయుధం 60 వ వార్షికోత్సవం సందర్భంగా భారత కమ్యూనిస్టు పార్టీ ఆంధ్రశాఖకు సర్వహక్కులతో దానిని సో.సు. అప్పగించారు !

ఈ నేపథ్యంలో సోమసుందర్ గారితో నాకు ఎనలేని స్నేహం. ఎల్లలు లేని అభిమానం.

పరుష పదజాలంతో ఎంత తీవ్రంగా ఆయన్ని తిడుతూ కరపత్రాలు/ లేఖలు రాసినా (నిజానికి అవెందుకు రాసానో ఇప్పుడైతే జ్ఞాపకం లేదు కానీ గొప్ప భాష వాడావయ్యా అంటూ వాటి పై ఆయన కితాబు మాత్రం పరమ గుర్తు.) నన్ను ద్వేషించని వ్యక్తి. ఆ క్రమంలో వజ్రాయుధం మళ్ళీ వస్తే బావుంటుందనీ అస్తమా నం నాతో అంటూండే వారు. కావాలంటే, తర్వాత కాలంలో ముద్రించి నట్లు, పాకెట్‌బుక్‌గా ఆయనే స్వయంగా ప్రచురిం చు కోవచ్చు. కానీ, విశాలాంధ్ర వాళ్ళు వేస్తే పంపిణీ బాధ ఉండదనీ,పైగా విస్తృత స్థాయి లో వెళుతుందనేది మా ఆలోచన. అప్పటికి విశాలాంధ్ర వారికి కొన్నిసార్లు ఆయన స్వయంగా చెప్పారు కానీ ఫలితం లేదు, వాళ్ళ బాధలు వాళ్ళవి !

ఏం చేయాలో పాలుపోని సందర్భంలో నేనొక తమాషా చేసా. పోస్ట్ ఆఫీసు నుంచీ పాతిక పోస్ట్ కార్డులు కొన్నాను. వాటిపై విశాలాంధ్ర శాఖలు అన్నింటికీ 'వజ్రాయుధం' గొప్పతనం చెబుతూ, దానిని నేటి యువతకి అందించవలసిన ఆవశ్యకత పేర్కొంటూ ఉత్తరాలు రాసాను. మొత్తం అన్ని బ్రాంచీలకు వజ్రాయుధం కాపీల కోసం ఒకేసారి అడుగుతూ రాయడంతో రెండ్రోజుల్లో సోమసుందర్ గారికి విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ తరపున వజ్రాయుధం ఐదవ ముద్రణ చేయబోతున్నామనీ కావున ముఖచిత్రం కోసం  కొత్త విలక్షణ ఫొటో ఏదైనా ఉంటే పంపమనీ కబురందింది. ఆయనతో పాటు నాకూ చాలా సంతోషం కలిగింది. అప్పుడా యన నాలుగైదు ఫొటోలు నాముందు ఉంచి ఒకటి ఎంపిక చేయాలన్నారు!

ఇప్పుడంటే అసహ్యించుకుంటున్నాను కానీ సిగరెట్ కాల్చడాన్ని ఇంటెలెక్చువల్ సింబాలిజమ్ గా చూసిన కాలం ఒకటుండేది. నాన్న చైన్ స్మోకర్. చాలా కాలం నేనూ పొగలో తేలి ఆడాను. కాబట్టి, తెలీకుండానే ఆ ఫొటోల్లో సిగార్ పట్టుకుని సో.సు. నిల్చున్న ఫొటోను తీసిచ్చాను. ఎందుకో, నాకందులో ఒక ధిక్కార ధోరణి కనబడుతుంది. ఒక రెక్లెస్నెస్ ఉంటుంది. అందుకేనేమో అది సెలక్ట్ చేసాను. ఆయన కూడా ఆ ఫొటోనే వాళ్ళకి  పంపేసారు. పుస్తకం ముద్రణ పూర్తై వచ్చింది. అంతే, ఎక్కడెక్కడ నుండో ఆయనకి ఫోన్లు. చాలా వరకూ పాజిటవ్ గానే. ఐనా, అకస్మాత్తుగా ఒకరోజు నా మీద దాడి ప్రారంభించారు. ఎందుకో అర్థం కాలేదు !

తర్వాత ఆయనే చెప్పారు. చాలా మందికి సో. సు. పొగతాగుతారని తెలియదట. సౌమ్య మూర్తిగా తప్పా అంత పెంకితనంతో ఉన్న ఫొటో చారిత్రక ప్రసిద్ధి చెందిన వజ్రాయుధం వంటి పుస్తకం ముఖచిత్రంగా ఉండటం పై కుటుంబ సభ్యులు కొందరు మొదలు స్నేహితుల వరకూ ప్రత్యేకంగా హైదరాబాదు నుండి ఫోన్ చేసి మరీ వాపోయారట. ఈ విషయాన్ని చెబుతూ, 'నువ్వు నాకు శత్రువు

వంటి మిత్రుడివి' అన్నారు. నేను చాలా తేలిగ్గా నవ్వేసాను. ఇన్నేళ్ళ తరువాత తరచి చూస్తే,మొత్తం ఆయన పుస్తకాలన్నింటిలోనూ దేని మీదా కూడా ఇలాంటి విలక్షణ మైన ఫొటో మరోటి లేదు. కళ్ళల్లో నిర్లక్ష్యం, కొంటెదనం మిళితమై ఒకరకమైన మెట్యూర్డ్ లుక్ వచ్చిందనేది నా అభిప్రాయం !

సో.సు. పరమ పిసినారి. అదే విషయం గట్టిగా ఆయనతో చెబితే తెలివిగా తప్పించు కుంటారు. ఇప్పుడు చెబితే నమ్మరు కానీ మొట్టమొదట సో.సు. గారి దగ్గర డబ్బులిచ్చి మాత్రమే ఆయన పుస్తకాలు కొనుక్కున్నాను. ఆరోజు ఇంకా నాకు జ్ఞాపకం. అందుకే, ఈరోజు చెదలు పడుతున్న ఆ రచనల్ని చూస్తే బాధేస్తుంది. విశాలాంధ్ర వాళ్ళు వజ్రాయుధం ప్రచురించాక కొన్ని కాపీలు ఆయనకి పంపారు. వెంటనే గదిలోని బీరువాలో తాళమేసి పెట్టే సారు. నేనూరుకోలేదు. కాపీ ఇవ్వకపోతే బాగోదన్నా. తప్పక ఒక కాపీ తీసి రాసి చ్చారు, 'చిరంజీవి కృష్ణగౌరవ్ కు శుభా శీస్సులతో' అంటూ. తర్వాత వజ్రాయుధానికి వజ్రోత్సవ వేడుకలు పేరిట వ్యాసం కూడా రాసాను. ఇప్పుడిక ఆ అక్షరాలు చదివే వారు ఎంతమంది ఉన్నారనేది ప్రశ్నే కానీ ఆ 'వజ్రాయుధం' జ్ఞాపకాలు మాత్రం నాలో నిత్య నూతనంగా ఇంకా అలాగే ప్రవహిస్తూ ఉండిపోయాయి !




**కొత్తజీరలు తెరచి మెరసినది కంఠం**

**కొత్త అలుగులు కూర్చి వెలసినది బాణం,**

**కొత్త రేకులు విచ్చి మెరిసిన పతాకం,**

**బానిసల విప్లవం – ఉత్సాహ సమరం,**

**శ్రామికుల స్వప్నం – పోరాట ఫలితం**

**పీడనా రహితం – సౌజన్య జీవితం.**

**–వజ్రాయుధం**

చిరంజీవి కృష్ణ గౌరవ్ కి
శుభాశీస్సులతో
[signature]
10-8-05

# డా. ఆవంత్స సోమసుందర్ కొత్త కోణం !
# ప్రజాస్వామ్య పరిరక్షణ వేదిక - "ప్రజ" !!
## (విస్మృత హక్కుల సంఘం జ్ఞాపకాలు !)

డా. సోమసుందర్ రాష్ట్రం చిత్తూరు మొదలు శ్రీకాకుళం వరకూ అంతటా తిరిగి వివిధ ప్రాంతాల్లో జరిగిన సభలు, సమావేశాల్లో ఆయన్ని అడిగిన ప్రశ్నలు, ఆ చర్చలకి ఒకరూపం ఇచ్చారు. అదే, 'సాహిత్యంలో సంశయ కల్లోలం' అనే గొప్ప పుస్తకం. ఎందుకనో దాని రెండవ ముద్రణ జరగలేదు. సో.సు. మీద వచ్చిన తీవ్రమైన విమర్శలు కూడా కొన్నున్నా యి. సి.వి. ఆ రోజుల్లోనే "గురజాడ, శ్రీశ్రీ ల మీద సోమసుందర్ దాడి" అంటూ పుస్తకం రాసారు. ఏదైనా అదో కాలం. అప్పటికి అన్నీ తెల్సుకోవాలనే కుతూహలమే కానీ నిర్మాణాత్మకత నాకు లేదు. అందుకే, "అరసం – విరసం, అభ్యుదయ విప్లవ సరసం" అనేంత వ్యంగ్యం నా మొదటి రచన లోనే ఉంది. ఇదెంత ఘాటుగా ఉండేదంటే భాషా అనే మిత్రుడికీ వాక్యం కంఠతా వచ్చు. ఆయన సోమసుందర్ శిష్యుడు. నా శ్రేయోభిలాషి. పోనీ, రాసి అచ్చేసుకున్నవాడ్ని ఊరుకోకుండా పనిగట్టుకుని అరసం, విరసం మేధావులకు పంపేవాడ్ని. తలపొగరు !

సాహిత్య అంశాలకి సామాజికం అతీతంగా ఉండరాదనే ధోరణే తప్పా నిజానికి కరపత్రమే కానీ తర్వాత పూను కుని చేసిన కార్యక్రమాలు ఏవీ గుర్తులేవు. బహుశా ఏదో సాహిత్య సమాలోచన నిర్వహించడం వరకూ చేసామేమో అంతే. కరపత్రం ప్రచురించడమే, అంతకుమించి ఏవీ గుర్తులేదు. ఈలోగ భుక్తి కోసం భుజాన సంచి పట్టుకుని ఉద్యోగాల వేటలో నేను ఊరొదిలి వెళ్ళాల్సి వచ్చింది. ఈ కరపత్రంలో ఇచ్చిన ఫోన్ నంబరు సో.సు. శిష్యుడైన కిలారి గౌరినాయుడు అనే ఉత్తరాంధ్ర ప్రాంతానికి చెందిన మిత్రుడిది. సో.సు. కావ్యాల మీద పరిశోధనకి సిద్ధపడి, తర్వాత నా మాట విని ఆయన 'కళాకేళి' పత్రిక పై పి. హెచ్.డి చేసాడు. ప్రస్తుతం విశాఖపట్నంలో కళాశాలలో పని చేస్తున్నాడు !

ఇప్పుడీ విషయం ఎందుకంటే, కేవల సాహిత్యం వల్ల ప్రయోజనం శూన్యమనీ, సమాజ హితం కోరే ప్రజాతంత్ర ప్రయ త్నాలు కావాలనే ఆకాంక్షతో

సుమారు రెండు దశాబ్దాలకి పైబడి పిఠాపురం లో డా. సోమసుందర్ గారు గౌరవ అధ్యక్షులు గా నేను ఏర్పాటు చేసిన సంస్థ 'ప్రజ'. 'ప్రజాస్వామ్య పరిరక్షణ వేదిక' పేరుతో అరవై యాళ్ళకి పైబడిన ముగ్గురు సాహిత్య పెద్దమనుషులతో పద్దినిమిదేళ్ళలోపు ఓ కుర్రాకుంక కలగలిసి స్థాపించిన మొదటి హక్కుల సంఘం అది. ఈరోజున్న హక్కుల స్పృహలో వెయ్యోవంతు కూడా ఆనాడు లేదు. ఐనా,పౌరసమాజంలో చైతన్యం తేవాలనే తపన, ప్రజల కోసం ఏదో చేయాలనే ఆలోచన ముందుకు నడిపాయి. అదే, ధైర్యం చేసి ఇంతటి సంఘం పెట్టడానికి ప్రధాన కారణం !

నా సంగతి మినహాయిస్తే మిగిలిన వాళ్ళు ఉన్న ఏకైక పౌరహక్కుల సంఘం ఇదొ క్కటే. ఆవంత్స సోమసుందర్ గారు ఆయన ఆచరణాత్మక అనుభవాల్ని ఎంతగా కాగితం మీద పెట్టి నమోదు చేసినప్పటికీ, మినహాయింపులు కూడా చాలనే ఉన్నాయి. ఇంగ్లాండ్ మహా గ్రంథాలయం లో ఇప్పటి విషయం తెలీదు కానీ అప్పట్లో ఆయన సందర్శించినప్పుడు అక్కడి లైబ్రరీ లో ఉన్న తన పుస్తకాల పట్టికను వాళ్ళు చూపిస్తే ఆశ్చర్య పోవడం, అప్పటి కప్పుడు వాళ్ళు నిర్వహించిన సమాలోచన. వాళ్ళిచ్చిన ఆత్మీయ జ్ఞాపిక, సర్టిఫికేట్ (పెద్దది చాలా కాలం న్యూస్ పేపర్లో పెట్టి జాగ్రత్తగా దాచుకున్నారు. తర్వాత ఏమయ్యిందో తెలీదు.) ఇలా ఎన్నైనా చెప్పొచ్చు!

హొవార్డ్ ఫాస్ట్ 'స్పార్టకస్' ముద్రణకి అప్పట్లో ప్రపంచ వ్యాప్తంగా విరాళాలు కోరగా సో.సు. పంపిన వంద రూపాయలు మొదలు, రచైతల సమావేశానికి ఢిల్లీ వెళితే అనుకోకుండా నిర్వా హకులు తననీ, కొశాంబీనీ ఒకే గదిలో ఉండమనడం, ఆ రాత్రి కొశాంబితో జరిగిన సంభాషణ.

ఎన్ని జ్ఞాపకాలు. దౌర్భాగ్యం ఏమిటంటే, ఈ మొత్తం సంగతులన్నీ స్వీయచరిత్రలో నోట్ చేయలేదు. (ఇంకెక్కడైనా చేసా రేమో నాదృష్టికి రాలేదు.) బతికుండగా పనికిమాలిన విషయాల కోసం అనవసరంగా పడ్డ గొడవలకు కొదవేం లేదుకానీ, ఇంత మందిని ఇంటర్వ్యూలు చేసిన నేనే తీరిక కుదుర్చుకుని ఆయన ఇంటర్వ్యూ ఎందుకు చేయలేదో, ఆశ్చర్యం. ఇంకెన్ని విశిష్ట విషయాలు ఆయనతో పాటే ఈ అనంతమైన కాల గర్భంలో కలిసిపోయాయో గుర్తున్న మేరకు దొరికిన పాత 'ప్రజ' కరపత్రంతో ఈ చిన్న రైటప్!

అవిగవిగో అంతరిక్ష మార్గంలో నిప్పుల దుర్గాలై...
తేజస్నిగ్ధాలై
పరిభ్రమించెను, ఖగోళ గోళమ్ములు !
భూగోళంలో అలుముకొనెను గందరగోళం
భూగోళం అట్టడుగున ఆఖరిపొర పర పర చిరిగెను.
అదిగదిగో! వినిపించెను, శంఖఘోష...
నక్షత్రాలే, రథచక్రాలై తిరునాళ్ళకు తరలిన సమూహమై
అంతరిక్ష మార్గంలో జరిపెను మానవ విజయోత్సవ
ప్రస్థానం !

–మలయా ప్రభంజనం (వజ్రాయుధం)

**ప్రజాస్వామ్య పరిరక్షణ వేదిక**
**"ప్రజ"**

మనుషులుగా మన ప్రవర్తనే మానసిక స్వచ్ఛతకి ప్రతిబింబం. వ్యక్తులుగా మన వ్యవహారశైలే వర్తమాన వ్యవస్థకి కొలమానం. నాగరికులుగా మన నడవడికే సమాజంలోని నైతిక స్థాయికి సంకేతం. తోటి జీవులతో మసిలే విధానాలే మానవీయ దృక్కోణాన్ని నిర్ణయిస్తాయి. సాటి పౌరులతో మెలిగే పద్ధతులే మానవతా సందేశాన్ని నిర్దేశిస్తాయి. నిరంతర ఘర్షణల్లో నుంచే నూతనాంశాలు ఆవిష్కరిపంబడతాయి. చిరంతన సంఘర్షణలతోనే సరికొత్త మార్గాలు సృజించబడతాయి. అలాంటి అనేక అభ్యుదయ సమాలోచనల సామూహిక ఫలితమే ప్రజ!

వృత్తి – ప్రవృత్తులతో నిమిత్తం లేకుండా కుల, మత, వర్గ, వర్ణ, జాతి తదితర జాడ్యాలకి అతీతంగా సాంఘిక శ్రేయస్సుని ఆశించే సంఘంగా తన సభ్యుల్ని ప్రజ గుర్తిస్తుంది. అభాగ్యుల అంధకార జీవితాల్లో ఆశలు నింపడమే ప్రజ ప్రధానోద్దేశం. అసహాయులు అన్నార్త ఆవేదనల్లో భాగమయ్యే భావావేశపు భావి హృదయాలే ప్రజకి దిశానిర్దేశం. తన ఆర్తిని హార్థికంగా హర్షిస్తూ తన స్ఫూర్తికి మనస్ఫూర్తిగా స్పందించే సహృదయ ప్రగతి కాముకుల్ని ప్రజ సాదరంగా ఆహ్వానిస్తోంది. మీ ఆగమనాన్ని అభిమానంగా కాంక్షిస్తోంది!

ప్రజలో సభ్యులుగా చేరండి !
ప్రజల్తో మమేకమవ్వండి !!
**సంచారవాణి : 9014430582**

| | |
|---|---|
| గౌరవాధ్యక్షులు<br>శ్రీ అవంత్స సోమసుందర్‌గారు | ప్రధాన కార్యదర్శి<br>మేకా మన్మధరావుగారు, |
| అధ్యక్షులు<br>శ్రీ గజరావు సీతారామస్వామిగారు | కార్యదర్శి<br>గౌరవ్‌గారు |

ప్రజ్ఞ పరిమళించే యువపారిజాతాలను
యెదకెత్తుకు ఊరేగిన వెన్నెల హృదయునకు
శతజయంత్యుత్సవ సందర్భంగా
అక్షర నివాళి...



# సాహితీ శిఖరానికి సాదర నివాళి !

(డా. ఆవంత్స సోమసుందర్ శతజయంతి)

నవంబర్ 19, 2023 ఆదివారం కాకినాడ జిల్లా పిఠాపురంలోని శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయంలో చెలికాని భావనరావు సభాసదన్ లో జరిగిన వజ్రాయుధ మహాకవి, శతాధిక గ్రంథకర్త, కళారత్న డా. ఆవంత్స సోమసుందర్ గారి శతజయంత్యుత్సవ సదస్సు కన్నుల పండుగగా జరిగింది. సుమారు 120 మందికి పైబడి పాల్గొన్న ఈ సమావేశంలో దాదాపు 50 మంది సో.సు. గారితో గాఢమైన వారి అనుబంధం గూర్చి పంచుకున్నారు !

ఢిల్లీ మొదలుకొని హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,రాజమహేంద్రవరం, కోరుకొండ, పెద్దాపురం, సామర్లకోట, కాకినాడ... ఇంకా అనేక ప్రాంతాల నుండి కార్యక్రమం కోసం పనిగట్టుకు వచ్చిన మిత్రులకూ, మొత్తం సదస్సు పూర్తయ్యే వరకూ ఉండి వారి భావాలు పంచుకుని శతజయంత్యుత్సవ ఆతిథ్యం, చిరు సత్కారాలు, స్వీకరించి ఆనందంగా వెళ్ళిన శ్రేయోభిలాషులు అందరకీ పేరుపేరునా ధన్యవాదాలు !

ఎంత గొప్ప కార్యక్రమంలో ఐనా పొరపాట్లు, కొన్ని లోటుపాట్లు సహజం. అలా సభికుల్ని వారి పాటలతో అలరించిన పెద్దాపురం ప్రజా నాట్యమండలి బృందానికీ చిరు సత్కరం జరగకపోవడం, కొద్దిమంది మిత్రులకి మాట్లాడే అవకాశం లభించకపోవడం మా తప్పే. ఉద్దేశ పూర్వకంగా చేయకపోయిన ప్పటికీ సదస్సు సంచాలకుడిగా జరిగిన దానికి పూర్తి బాధ్యత నాదేనని అందుకు క్షంతవ్యుడ్నని మనవి చేస్తూ వారికి ప్రత్యేక అభినందనలు!

శతజయంతి సందర్భంగా ప్రచురించిన పుస్తకం 'ఆకాశమంత అక్షరమూర్తి – డా. ఆవంత్స సోమసుందర్ ( వజ్రాయుధ కవికి వందేళ్ళు)' అనే 40 పుటల చిన్న పొత్తం. కంటి ఆపరేషన్ కోసం ముంబయి నుంచి హైదరాబాద్ వచ్చిన కామ్రేడ్ వరవరరావు గారు నాలుగుపుటల్లో ఈ పుస్తకానికి ముందుమాట గా ఆత్మీయ సందేశాన్ని 'ఆవంత్స సోమసుందర్ – ఆనాటి జ్ఞాపకాలు' పేరిట డిక్టేట్ చేసి పంపించడం విశిష్టమైన విషయం !

అపూర్వమైన శతజయంతి కార్యక్రమం గురించిన మధుర జ్ఞాపకాలను పూర్తిగా తీరిక చేసుకుని తర్వాత పంచుకుంటానుగానీ, ఎక్కడెక్కడ నుండో సమావేశం కోసమని శ్రమకోర్చి స్వచ్ఛందంగా వచ్చి పాల్గొన్న సాహితీవేత్తలు, సామాజిక కార్యకర్తలు, సారస్వత పిపాసులకి పేరుపేరునా ప్రత్యేక ధన్యవాదాలు.



"ఆకాశమంత అక్షరమూర్తి డా॥ఆవంత్స సోమ సుందర్" - పుస్తకావిష్కరణ




డా॥ఆవంత్స సోమ సుందర్ గారి లేఖిని శ్రీమతి యర్రమిల్లి ఉషాకుమారి గార్కి సన్మానం

# నిజమైన నివాళి

తెనుగు సాహిత్య చరిత్రలో పిఠాపురానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. అభినవ ఆంధ్ర భోజుడిగా కీర్తి పొందిన పిఠాపురం రాజా రావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహుద్దూర్ వారు ఆస్థానంలో భువన విజయం జరిపే అతిరథ మహారథులైన ఉద్దండులు ఉండేవారు. కానీ వారిలో ఏ ఒక్కరి స్మృతి మందిరం గానీ, జ్ఞాపక చిహ్నాలైన వేవైనా గానీ లేవు. కాలగర్భంలో కలిసిపోయాయి. ఇటీవల కాలంలో రాజమహేంద్రవరంలో కందుకూరి వీరేశలింగం గారిది, విజయనగరంలో మహాకవి గురజాడ స్మారక మందిరం లానే మన సోమసుందర్ గారి స్మృతి మందిరం ఒకటి వారి అవార్డులు, సర్టిఫికెట్లు, మెమెంటోలు, డైరీలు వగైరాలతో పదిల పరచడం చాలా అవసరం. ఇది మనందరి కనీసం బాధ్యత. ఆ మహాకవికి మనం అర్పించే నిజమైన నివాళి కూడా.



జన్మమెత్తిన మానవునకు
జీవితమే పరమధనం,
అయితే, అది ఒకమారే
అతని కొసగబడిన వరం

పుట్టలోని పురుగుల వలె పుట్టిపెరిగి,
సంఘంలో తావులేక
అస్తిత్వ ప్రయోజనం
ఊహకు అందనిదవగా

తన చరిత్ర చెరిపేసుక,
తన దారిని వెళ్ళిపోయే
మానవుడిక పుట్టబోడు
సుడిగుండంలో పడి తిరగడు."



– ఖరార్‌నామా వజ్రాయుధం